# శ్రీ రామ కథా లహరి

మూడు భాగములు

ఇది

బాలకథానిధి.

కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారిచే

రచియింపఁబడినది.

బ్రి॥ కవిరాజ, శ్రీపాదకృష్ణమూర్తి, శాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

శ్రీమోతేనారాయణరావు జమీందార్ యం, యల్, సి, గారి

కంకిత మీయఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము

లలితాముద్రాలయమునందు

ముద్రింపబడెను.

1929



[వెల 1—0—0

# శ్రీరామకథాలహరి

మూడు భాగములు

ఇది

బాలకళానిధి.

కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారిచే

రచియింపఁబడినది.

బ్రి॥ కవిరాజ, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి

శ్రీమోతేనారాయణరావు జమీందార్ యం, యల్, సి, గారి

కంకిత మీయఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము

లలితాముద్రాలయమునందు

ముద్రింపబడియె.

శ్రీ క్షేమ సం॥ 1929

 [వెల 1—0—0

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 15 | చెప్పరాదుగాని చెప్ప పలసెనిందు | చెప్పగారాదుగానిందుఁ జెప్పవలసె. |
| 11 | 25 | రనము | రసము |
| 22 | 18 | గూడ | చూడ |
| 24 | 9 | న్నెల్గు | న్నెంగు |
| 29 | 7 | చేతజ | చేత |
| ,, | 19 | చెప్పవు | చెప్పు. |
| 30 | 20 | వెలవుల | వెలవెల. |
| 31 | 18 | త్వారిగతి | త్వారితగతి |
| 36 | 13 | యది | యాది |
| ,, | 18 | సట్లుసేయ | రాకగలుగ |
| 38 | 3 | కొసియా | కొనియాడుచు |
| 51 | 8 | పరిక్కనా | పరిక్కగనా |
| 53 | 11 | కన్నమంత | కన్నమేమెంత |
| ,, | 16 | పించుక | పిచ్చుక |
| 58 | 1 | మరల | మలర |
| ,, | 19 | నిజసుతు | యజసుతు |
| 61 | 6 | మైన | మైనమనసు |
| ,, | 8 | తెలుసు | తెలియునితర |
| 63 | 8 | మన్న | నన్ను |
| ,, | 12 | హాధన | సాధన |
| 65 | 22 | సీతా | సీతా |

VII

# విన్నపము.

నేను గ్రంథములు వ్రాయుట కిదియే ప్రథమము "పద్యం పద్యస్యలక్షణం" అను నార్యోక్తిని విని యిది వ్రాసితినే కాని లక్షణమెఱుంగను. కావ్యాదులు చదువలేదని నాగ్రంథమే సాక్ష్యమిచ్చును. ఇది శ్రీరామచంద్రుని చరిత్రమగుటచేత నిందు తప్పులున్నను దోషము రాఁబోదనియుఁ పండితులును గర్హింపరనియు నిట్లు సాహసించితిని. పండితులు గర్హించి తిరస్కరించినను అవియన్నియు నాశీర్వాదములుగానే భావింతును.

ఈహరికథను వేదశాస్త్రవేత్తలును, కవిరాజ బిరుదాంకితులును, ఉభయభాషాభూషణులును, బహుగ్రంథకర్తలు నగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు ప్రథమకవుల మదులకు నొప్పిగలుగనట్లు "స్థితస్యగతిశ్చింతనీయా" అను న్యాయమును బురస్కరించుకొని సంస్కరించినందుల కెంతయుఁ గృతజ్ఞుడను. ఇందు నాతప్పులకు సాయముగా నచ్చుతప్పులు కొన్ని పడినవి. అందుఁ గొన్నిమాత్రమే శుద్ధపత్రమునఁ జూపితిని. ద్వితీయముద్రణ మందన్నియు సవరించుకొందును. అని విన్నవించుచున్నాను.

ఇట్లు

బాలకళానిధి

కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు.

# అభినందనము

శ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు నేను భీమవరమునకు వెళ్ళినప్పుడు నాపైఁ గొన్ని పద్యములు వ్రాసి సభలోఁ జదివినాఁడు. అవి విన నామదికి బాలునియం దమితమగు ప్రేమపుట్టుటంచేసి సానురాగంబుగ నితనిం గొనియాడితిని. అది కారణంబుగ నితఁడు తాను రచించిన "శ్రీరామ కథాలహరి" అను నీహరికథాగ్రంథము సంస్కరించి ముద్రింపఁగోరెను. గ్రంథము పరిశీలింపఁగా నందు పెక్కుదోషములు కానవచ్చినవి. బాలకవులను దిరస్కరించు స్వభావము లేమిం జేసి ఈప్రారంభకవిత్వము నెట్టులైన నొకరీతిగా సంస్కరించి వానిమదికి సంతోషము గలిగించుటయే ముఖ్యమని తలంచి సాధ్యమగునంత వఱ కించుకించుక సంస్కరించితిని. ఇక్కాలమునఁ గవులనిపించుకొని గ్రంథములు చేసినవారికిఁ బెక్కుమందికిట్టి లోపము లేకపోలేదు. సహజపాండిత్యముగా "పద్యం పద్యస్యలక్షణం" అని తెలిసికొని వ్రాసిన యీగ్రంథము నందునుండుటలో నచ్చెరువులేదు. దీనికిఁ బెద్దలు గర్హింపరనియే నానమ్మకము. నేను క్రొత్తకవిత్వమును జేసినట్లు సంస్కరింపలేదు. సర్వసాధారణదోషముల విడిచి యింతటినుండి యిట్టిదోషములు పడనీవలదని బాలకవికి బోధించుచు నించుక సంస్కరించి ముద్రింపించితి. ఇది హరికథగావున దోషములున్నను గుణములేయగుఁ గాకయని పెద్ద లాశీర్వదింతురుగాక.

శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి

IX

శ్రీ పరబ్రహ్మణే నమః

తే॥ విబుధలోకంబు కవిత్వైకవిద్యయనుచుఁ
జదువువచనార్థములకు సంశయముగలదె
విద్యలందున నుత్తమవిద్య కవిత
దానిఁ దెలియుట లోకమంతయును గనుట.

నా బాల్యమిత్రులగు కె. బాలబ్రహ్మానందదాసుగారు తమచే రచింపఁబడిన ఈ "శ్రీరామకథాలహరి" కీ పీఠిక వ్రాయవలయునను కోరికగలవాఁడనై "స్థాలీపులాకన్యాయము"న బరిశీలించితిని. ఇందీకవి యెంతవఱకుఁ గృతార్థుఁడయ్యెనో యదిపండితులకే విడిచిపెట్టెదను. వీరు బాల్యమునుండియు సంస్కృతాంధ్ర భాషాభిమానులై మనీషుల సహవాసబలమున హరికథోపన్యాసములలో మంచి ప్రజ్ఞగణించిరి. వీరి కథాప్రసంగము మృదుమధురవాగ్ధోరణితోఁ జక్కని యుపమానములతో భరతశాస్త్రపద్ధతులతో కమనీయ లయజ్ఞానములోఁ ప్రేక్షకుల నానందాబ్ధి నోలలాడించును. వీరు పెక్కు యోగ్యతాపత్రములంది యున్నవారు. ఇంత చిన్నప్రాయముననే పండితపామర రంజకముగా హరికథఁజెప్పెడి శ్రీనిధులలో నగ్రగణ్యులగుచున్నారు. ఈ కవికవిత్వమందుఁ గొన్నితప్పులున్నను పరమాత్మ-స్వరూపుండగు శ్రీరామచంద్రునియందుఁ దమకుగల భక్తిచే దానీ గ్రంథరచనకుఁ బూనుకొంటి నని వ్రాసికొనిన యీ బాలకవిని మన్నించి పండితలోకము తగుప్రోత్సాహమొసంగి యాశీర్వదింతురని నమ్మెదను. "కాళిదాసమయూరాదికవులకైనఁ గలవు తప్పులు" అను నార్యోక్తిననుసరించి హంసరాజము నీరమునువిడిచి క్షీరమును గ్రహించు చందమునఁ జెడ్డను విడిచి మంచినే గ్రహించుట మనీషుల కర్తవ్యము. "చెఱకునకు వంకఁబోయినఁ జెడునె తీపు" అనునట్లు శ్రీరామచంద్రుని చరిత్రముగావున సర్వజనాదరణీయముగానే యుండుననియు తలంచి యీ బాలకవి కాయురారోగ్యములు ప్రసాదించిమఱికొన్ని గ్రంథములు వ్రాయునట్లాశీర్వదింతురుగాక యని పండితప్రకాండులఁ బ్రార్థించుచున్నవాఁడ. ఇట్లు

మాందరపు చిట్టిపాపయ్య

# అంకితము

తే. శ్రీరమావిభుసతియైన శ్రీసతియును
మారుతి ప్రియుఁడైన రమావిభుఁడును
వీరి దయచేతఁ గానున్న విధియుఁగూడి
మోతెనారాయణార్యునిఁ బ్రోచుగాక.

తే. ఇంటనున్నప్పుడెల్లను గంటబడుచు
నిచ్చపూజింపుమని నిన్ను హెచ్చరించు
హనుమనినుఁబ్రోచు నారాయణార్యవర్య
మోతె వంశజలధిచంద్ర నీతిసాంద్ర.

తే. వరువుగలవాఁడవని నిన్నుఁ బ్రస్తుతింతు
ధనము కోరి కిచ్చకంబని తలఁపఁబోకు
రామచరితముఁ గృతిగొని రాజ్యవైభ
వములఁ గొనుమయ్య శ్రీరామవల్లభుకృప.

క. మోతేనారాయణరా, పేరగునాకృతికటంచు నెంచియె సీతా
నాతిపతినిన్నుఁ జేరఁగ;బ్రీతింపంపించెనన్నుఁ బ్రియముగనఘా

సీ. ఏకుటుంబమువల్ల నేలూరు పురమునన్
దానధర్మంబులఁ దగ్గియున్నె
నేకుటుంబముచేత నేలూరుపురమున
బహుజనుల్ భక్తినిఁ బడయుచుండు
నేకుటుంబపుమేడ లేపుగాంచుటచేత
నేలూరు కనులకు నింపుగూర్చు
నేకుటుంబమువల్ల నేలూరుపురిమిల
భక్తివైరాగ్యముల్ వడయనయ్యె

తే. అట్టిమోతే సుధాంబుధిఁ బుట్టినట్టి
సుగుణముల పుట్ట శాంతికి సాటిగట్టు
ఆంధ్రదేశసేవం జేయనాటపట్టు
నైన నారాయణుఁడు కృతి కధిపుఁడయ్యె.

గ్రంథకర్త



శ్రీ

రామకథాలహరి.

# శ్రీరామజననము..

—: ఇష్టదేవతాప్రార్థనము. :—

గీ. శ్రీపదాబ్జములను బట్టఁ జెంత నిలిచి
నారదాదులు సంకీర్తనం బొనర్చు
వేళఁ దమకష్టమంతయు విన్నవించి
కావు మన దేవతలఁ బ్రోచు దేవుఁ గొలుతు.

గీ. విఘ్న మొకఁడైన నాదుకవిత్వమునకుఁ
గలుగు నీకుంటివేని నీకడుపునిండఁ
బెట్టి యుండ్రాళ్ళ నెల్లరుఁ బట్టికొలువ
హరికథలలోనఁ జెప్పెదు నాదిదేవ.

కం. నానాల్కపైన నెప్పుడు
పూనిక వసియించి కృపను బూనియు సభలన్
గానము సల్పుచు నుండుము
నే నీపాదములఁ గొల్తు నెప్పుడు వాణీ.

కల్యాణి=ఆది

ప॥ సీతారాముల చరితము దెలిపెద । శీలవతీమది చెదరనీకవిను॥ సీ॥
అ॥ సీతివిదుఁడు రాముండతనిసతి । మాతసుమా పతివ్రతలకెల్ల॥ సీ॥
మి॥ ధాతకైనపొగడ తరమెవారల । దాంపత్యంబేమని వర్ణింతును
యేతపంబు రాఘవుఁడు చేసెనో । యేపుణ్యము జానకి గావించెనో॥ సీ॥
చ॥ కొడుకుకోడలన్న నిట్టివారలె । కులముద్ధరించు చుందురుసుమ్మా
బడుగులెందరైన నేమిఫలమో । ప్రాణేశ్వరియటులుండవలెగాని॥ సీ॥
మి॥ కడునిడుములబడి కాంచెనుసీతా । కాంతునిదశరథుడుపుత్త్రేష్ట్యంతమున

కడకుకొడుకుచింత లేకనాకము । నడచెనునైక కామంధరలవలన ॥సీ॥

కం. అనిదెల్పు నాథునింగని
వినఁగోరికగల్గి నాకు వీరిచరిత్రం
బనఘా ప్రీతిస్వనిరొద
వననాతఁడు చెప్పదొడగెఁ నాపార్వతికిన్.

బేహాగ్=చతురశ్రగతి

ప॥ సరయూనదీతీరమున । బరగునయోధ్యాపురము స॥

అ॥ నిరతము నాయూరనెపో । తిరుణాళ్లు జరుగుచుండు స॥

చ॥ విరివిగధనవంతు లుండు । తరుచు లేరు పేదవారు
సరిగౌరవమునఁ జూతురు । పరమతములవారిని॥ స॥

మి॥ నిరతము నాయూరివారు । మురారిఁగొల్చుచు నుందురు
పరపురుషుల కంటఁబడక । పతిఁగొల్చెదుర పడఁతులు స॥

2॥ ఆచారమెఱిగివిప్రులు । నీచసేవచేయఁబోరు
బీచంబులుబలికితుదకు । పిఱికిపడు క్షత్రియులులేరు

మి॥ ఏచందంబుననైనం । గాచుధర్మమును వైశ్యులు
సాచాగ్గిన శూద్ర సంతతిగ్గినయూ స॥

వ॥ కాంతా! అజమహారాజను నొకఁడుకలఁడు. అతండత్యంత సుగుణశాలి

మంజరులు

1॥ ఆపురవరమును కొంతకాలమా । యజుండుపరిపాలించెన్
తాపసియగు తలపుతోడసుతుడగు।దశరథు రాజుగనుంచెన్ (దశరథుఁడు)

2॥ ప్రియసతికౌసల్యతోడ రాజ్యము । నయమునఁ బరిపాలించెన్
ప్రియసుతుఁడొక్కఁడు నాన్నాయనితనుఁ।బిల్వమికివిచారించెన్

3॥ క్షేత్రపటుత్వముచాలకయనుచును । జెలినొకతెరుద్వాగుఁశించెన్
ఆత్రముతో సుతులుగల్గలేదని । యపుడుమరల త్రిగుశించెన్

వ=వీరితోతీర్థయాత్రల సేవింప నెంచి

గీ॥ అటులముమ్వురుభార్యల నటసటగల
తీర్థయాత్రలసేవించు తీరులోక
మునను గలిగినయన్ని నోములనునోచు
గతినిజేసిన పుత్త్రులు గలుగ రైరి.

వ=అంతనో కాంతా యాదశరథుడిట్లు చింతించె

ఆ॥ సుతులులేనియిల్లు సతిలేనితల్పంబు
పంటలేనిభూమి పాడుగాదె
చందురుండులేక సంద్రంబుపొంగునా
యట్టులేయివన్నిఁ యణగియుండు

కన్నడ-చతురశ్రగతి

ప॥ జగతిలోన సుతులొందవుటకంటెను । జన్మకుఫలమేదీ యోచింపఁ గ॥
అ॥ నిగమాగమశాస్త్రజ్ఞుడైన సవ । నిధులనేలు రారాజైనఁగాని జ॥
మి॥ తగువారలలో మగవాఁడైఁ తన । పగవారిని సాధించినప్పటికి
నగరాజ్ఞామాతభర్తుఁడైనను । నాకపర్యంతమేగివచ్చినను జ॥
చ॥ యోగములకునిధియౌ రాజయోగమా । యోగమునకునాధారము
(సంస్కృతి)
బాగుసంస్కృతికిమూలమునిజసతి । భోగమునకుసుతులొందవు టఫలము
మి॥ ఇహపరంబులకుఁ జేరువయేగద । యిబ్బందియు పున్నరకములేకనె
సహజవిరుద్ధముఃగాకజనులలో । సాహసమొప్పందిరుగఁవగుటకు జ॥

వ=అట్లుచింతించి భరింపజాలని పుత్రవిహీనతచే నూరకొనఁ
జాలక సృష్టికర్తయైన పరమేష్ఠిందలపోసి యిట్లనియె

సీ॥ విద్వాంసునకుఁజూడ విత్తంబునీయవు
ధనవంతునకు విద్యదాకనీవు

ఔషధములవాఁడు నదనెఱింగెడివానిఁ
జేజూచు నైజంబుఁ జేరనీవు
పనిలేనికొండల పాలెచేయుదుగానిఁ
సస్యంబులకు చిన్కుజారనీవు
బుద్ధిమంతునికి నెప్పుడు మంచిసతినీవు
గుణవిహీనుండైనకూళకిత్తు
గీ॥ వకటసంతతిలేక మాయట్టివార
లెందరోగల్గ బేదలఁ జెందఁజేతు
వేమికూడులేకన్మాడ వెతలజెందఁ
బాడువిధియేల నీతెల్విపాడుగాను.
వ=అనుచునో పార్వతీ

మంజరులు

1 ఈగతి బ్రహ్మనునిందించికొలువు । కేతెంచెచింతమించి॥
కాగలకార్యంబేమనిమంత్రిని।గనుగొనెనటుపిలుపించి॥ (అంతమంత్రి)
2 మీజాతకమున నల్వురుపుత్రు । లమితబలులుసుగుణఖనులు॥
రాజాజనియించెదరని యున్నది । రఘుమహారాజసములు॥
3 గానమీరుచింతింపఁ దగదికను । గెలిగెదరు సుతులునిజము॥
దేనికేదియెప్పుడుప్రాప్తమొనమ । యానమించిమఱిగనము॥
వ=అనుమంత్రితో దశరథచక్రవర్తి యిట్లుపలికె
శంకరాభరణము=త్రిపుట

ప॥ ఇంకాగల్గెదరాసుతు । లేండ్లుగడచినవాఁడ నరువది ఇం॥
అ॥ పంకజాసనుఁడిట్లుగోడ్డుబ్రతుకు।బ్రతుకుమనినానుదుట వ్రాయగా॥ఇం॥
మి॥ అంకమునం దొక్కసుతుండే । వంకరవాఁడైనానుండిన
శంకలేక పున్నామనరక । మింకగడచెనని యనుకొనినా॥ ఇం॥
చ॥ సంధ్యాసమయమగుచున్న నీజన్మము । సార్థకమునకు రాకపోయెను

మెందుకీ వైభవములన్నియు వేఁటఁగల్పనా మంటఁబెట్టన (పేద)
మి॥ లందరివలెనేనుంగూడ । సధముడనై సుతులుండరాద
నందరింపఁజేయఁగ నెవరిక । నాతోనంతరిచె నీవంశం బిం॥
సీ॥ జగమును తలక్రిందుసలిపెడు గురుడుండి
సన్ తతినాకు కొరంతయన్యె
నందరివలెనొక్క యంగనామణిగాక
ముగ్గురుండియు సుతుంబొందనైతి
పుత్రశోకంబునఁ బోమెదవనిమును
మునియిడ్డ శాపానమున్గనైతిఁ
కొడుకేసతికొగల్గి కొరతగల్గినసతు
లల్కగొనిన యప్పు డడలనైతి
గీ॥ నాంధ్రముప్వురకును నిచ్చియాడనైతి
నొక్కసుతునైన ముద్దుగానోసుమంత
కల్గెదరు సుతులని యాసగల్గజేతు
వేడసుతులేడనే నాసవీడువాడ.
వ=అటుగాకనోమంత్రి
ఆ॥ ఏంతవిభవమున్న నెంతురోర్వఁగఁ బ్రిజల్
లేమికొంచెమైన లేరునోర్వ
ఎందరెందుసుతుల నెందఱఁగన్నను
లేనివాడొకండ గానఁబడును.
వ=మఱియు
ఆ॥ చంద్రులోనిమచ్చ జనులెల్లఁజూతురు
చుక్కలోనితీరు జూడరేరు.
గొప్పవారిచెడ్డ జెప్పకొనుచునుంద్రు
లోకులెల్లపైకి రాకమున్నె.

వ=అనదశరథునకు మంత్రియిట్లనియె.

బిళహరి=ఖండగతి

ప॥ నానుడువులాలించు । మానవాధిపనిజము

అ॥ ఏనుతొలిపలికినది । గానవగునికముందు॥ నా

మి॥ వేనవేలుమీక । న్నను వృద్ధులుసుతులను
గానమె కనుచుండుట । కమలగర్భదయచే॥ నా॥ [విధి]

చ॥ వాత్రితోసమమైన । జ్యోతిషమబద్ధమే
ఖ్యాతినిల్పగ సుతులు । కల్గెదరుతప్పకను

మి॥ ఈతీరునసర్వము నెరిఁగిన మీరేయిటు
మాతోపాటగుటలు । మహనీయాధర్మమె నా॥

వ= అనినమంత్రితోఁ దశరథుం డిట్లనియె

ఆ॥ వయసుమిగిలినట్టివారికి సంతతి
గల్గెఁ గల్గునన్న గణుతిసేతుఁ
గాని ప్రాయమందుఁ గల్గినయందము
కానికాలమునను కానఁబడునె.

కం॥ జవ్వనమేగిన పెండ్లియు
నవ్వనుతాతకునుఁ గల్గునట్టికుమారుం
డివ్వనని యిచ్చుబేరం
బెవ్విధమునసైనదవ్విధమేసుమమంత్రీ

మంజరులు

1 అనియికనిరాశ జేసి కొనఁదగిన । పనియగునాయిదికాదు
మునులనిచ్చటికిఁ బిలిపించుము తప । మున నల్పగనేఁబోదు

2 అందము చందము మాటకేమి కుల । మిందునఁదరించగలదు
మందమతిచేత నిట్టులంటినని । మనమున నుంచగవలదు

వ—అనుదశరథునకు మంత్రియిట్లను.

ఆ॥ మొదటికంటె పెక్కు ముదమిచ్చునిప్పుడు
చింత చేతనట్లు చెప్పినారు
గాని దృష్టిమరలఁబూని సంతోషించు
పుట్టుగ్రుడ్డివాని పోల్కెననఁగ.

వ—అనదశరథుడు

సీ॥ నేనుభజింపఁగఁబోని దేవుళ్ళెరి
దేవమహత్వంబు తెలియ దేల
నాసతుల్భక్తితో నోచని నోమేది
నోములుఫలమేల నొసగవయ్యె
నేనుదర్శింపఁగబోని తీర్థంబేది
తీర్థఫలములేల తేటపడవు
నాసతుల్బిడ్డలకోసము దిన్నట్టి
మందులగుణము లేమయ్యెనకట

గీ॥ చెప్పరాదుగాని చెప్పవలసెనిందు
నన్నవస్త్రగోభూమి ఫలాదిదాన
ముల మహాఫలమే యేటమున్గిపోయె
నింతకును పుత్రభాగ్యమే యిపుడులేదొ.

వ॥అని

మంజరులు

1 ఉలుగుగలిగెవాని వోలెగడుని । ట్టూర్పులు విడుచుచునుండు
పిలిచినపలుకు నిష్టంబుదప్పిదా । నలుకగొనినట్టులుండు
2 అంతవసిష్ఠాదిమౌను లచ్చటికి । కరుగుదెంచుటనుజూచి
సంతసములేక నతికష్టమ్మున ।సాజ్ఞకూర్చొనఁగజేసి॥

ఆ॥ ఊరకున్న యట్టి యారాజునుంజూచి.
యతనిసొత్తైదినెడు కతనవారు
సుతులుగల్గుదురను సూత్ర మెఱింగియు
మతులుచెడినయట్లు మ్రానువడిరి.

కం॥ రఘువంశ చంద్రదనీకాక
తగినయుపాయంబుఁ జెప్పఁ దలపెట్టితి నే
మృగరాజతుల్య భీకర
సుగుణాకర వినుమటంచు సూతుండనియెన్.

కళ్యాణి=చతురశ్రగతి

ప॥ అనుమానముపల దిటువినుమా । అజసుతనిక్కమిటుల గనుమానీ॥
అ॥ మానమునసందియమునుమానుమా।యినకులముతరించెననుకొనుమా
చ॥ ఋశ్యశృంగుడనుఋషివరుఁడాడిన । రసమగుపలుకులపసవినినాడను
దశరథుండుపుత్రకామేష్టినిఁజేయఁ । దలపెట్టుననుచునాతోననియెను
మి॥ దశఫలములిచ్చు పుత్రికామేష్టినీ । వు సేయఁగామువ్వురసతులవలన
నసమానమైనసుతచతుష్టయము। దశమాసములకుఁగల్గెదరనియెను॥ అ॥
చ॥ కావుననీవాఘునునిటురప్పించి । సావధానముగ సలుపుమావ్రతము
దేవతలకుఁ బ్రీతికరము దేశము । చేవగలిగి సస్యసమృద్ధిగానుండు
మి॥ నీవుఁగోరినట్లు సుతులుతప్పక । నిరుపమానవంతులు గలిగెదరు
నావచనంబులుపాటిసేయుమా । నరాధీశ త్వరపడినిరతముగను న॥

మంబగులు

1 తథాస్తనుచునును లెల్లనొక్కమొగి । మదంబుతోడుతతనిరి
విధాత నేటికి ఫలించునట్టుల । విధించెకర్మములనిరి (అనదశరథు)
2 డాలిలేదుచూలాలుగాదు సుతు। డయ్యాసోమలింగమనిరి.(యనినటు)
లేలయిూలీలఁ భ్రమింపజేసెద । రెన్నోమాఱు లిటులనిరి

3 అనవినిమునులిట్లులనిరిదశరథా । యావినీదృఢమునుగోరి (యంటిమి)
వినుయథార్థమిది ఋషినిరప్పించు । మనియందఱు మొగిననిరి॥

4 ఋషులచరిత్రలు వినెదుప్రీతిగల । దశరథుఁడిట్లులఁబలికె
శిశువులమాటలకేమిగాని యా । ఋషివార్తవినగనులికె॥

5 ఋశ్యశృంగుని చరితంబడిగిన । నృపునకుసూతుడు జెప్పె
అసమానతపోగరిష్ఠుండగుచు । నామహనీయుండొప్పె॥

6 సతులనఁగా నెట్టివారో యెఱుఁగడు సర్వేశ్వరతుల్యుండు। ఆ॥
పతితపావనునిఁ దోడ్కొనివచ్చెను । వంగభూపవర్యుండు॥

7 అందులకుం గారణంబుదెలిపెద । నాదేశంబుననున్న
మందులోనికైన యేసస్యము । నెందుఁదొరుకకే తెన్న॥

సీ॥ కనలేకయెంతయో కాలముచింతతో
దుంపలనాకలి చంపినార
లవికూడ తేలేని యధికులుకొందరు
బురదమట్టిందిన మరిగినారు
పిచ్చిమెత్తినవారిమచ్చునఁ గొందరు
చెట్లాకులనుదినఁ జేరినారు
మేతలేకేమూళ్ళమీదికివచ్చెదు
కిరిమృగాదులఁ దినబరగినారు.

గీ॥ రోమపాదుర్డ భూపతినోముకొనిన
నాఁడుసోలెడు బియ్యముగూడలేక
కటకటంబడి మానులగాంచియనియె
క్షామమెట్లులఁబోయెడుఁ జాడమనుచు॥

గీ॥ అనినమానులతనిఁ జూచిజనవరేణ్యా
కశ్యపమునీంద్రుమనుమడు ఋశ్యశృంగు

డు సుతుఁడౌ విభాండకునికిఁ బసగలాఁడు
అతనికిమ్ము నీసుతనపుడగు శుభంబు.
తే॥ అతనిఁదోడ్కొనఁ నేఁగిన యంత రాఁడు
చిత్రమేదైననతనినిఁ జేరిచాల
కష్టపడవలెఁ గావునఁ గాంతలన్న
నెఱుఁగడౌటచే వేశ్యలనేఁగు మనుము.
వ=ఏమంటివేని
కం॥ ఏమాయమైనఁ గెలువఁగ
సామాన్యునికౌనుగాని సన్మునియైనన్
స్త్రీమాయ గెలువలేఁడను
మామూలు పదంబునీవు మరువకు రాజా.
గీ॥ స్వర్గమేలుఁ బిడౌజుని స్వచ్ఛత చెడి
యోనులు శరీరమంతయుఁ గాన బడుట
స్త్రీవిలోలత్వమునఁగాదె చెప్పుమయ్య
యతనిసహపాఠి చంద్రుని యరయుమయ్య.
గీ॥ అట్టిప్రాజ్ఞుడౌదిట్ట రవంత బాలు
డెట్లులైనాడొ చూడుమియెల్లవిధుల
నెరిగినట్టి యింద్రుండును నేటఁబడియె
పలుకెఱుంగని చంద్రుడుం బాటఁ దప్పె.
గీ॥ చంద్రునట్టులె యాబుషిసడలమనసు
నీవుపంపిన వేశ్యలనెట్టులైన
కూఁడిరాకమానడు సుమకోర్కెమీఱ
గణికకాంతలవేగమె పనుపుమయ్య.

మంజరులు

1 అంత రాజు గ్రామమునంగలవే। శ్యాంగనలంబిలిపించెన్

సొంతముగాఁ ధానుగనియందమగు ॥ కాంతలనటుబంపించెన్॥

(బంపించుచు)

2 యెట్టులైనఋశ్యశృంగుఁ దోడ్కొని । యిటకరుదెంచితిరేని॥

పట్టుబట్టలునుఁ బంగరుతొడవుల । బహుగనిడెదదయఁ బూని॥(అన)

3 వెలవెలందులాతొమపాదునకు । సలామనుచువడిఁజనిరి

కళంకములేని పున్నమశశినిం । గెలువఁజాలుమునిఁ గనిరి

వ=అట్లుజేరియెట్లైన నాఋశ్యశృంగుని తపంబు విఘ్నముగావింపనెంచి

జేహగ్ చతురశ్రగతి

ప॥అక్కామనుజులకెక్కడనైనను।నిక్కమటేకొమ్ములుగలుగుటలో॥

అ॥ నిక్కంబేనాటక్కరియావాని । చక్కజేరిమనమరయుదమా॥ ఓయ॥

చ॥ మనవలెవేనికి జడలగుపించవు । మందమతిగాని కాడుగదా

కనిరుచియగుఫలములీతడెన్నడు।దినదియవివేకిగాడుగదా॥ పెద్దక్కా॥

2 వేడినితీసెడి భూతినినీతఁడు । బూడిదయంచును నెంచెగదా

జాడఁదెలిసిసామవేదమెప్పుడు।బాడియెఱుంగనివాఁడుగదా॥ ఓయ

గీ॥ ఇట్టులంబోఁడుచును మునిచుట్టునున్న

పువ్వుఁదీఁగల దరిఁజేరి నవ్వుకొంచు

కోసినట్టి పూలన్మీద వేసికొంచు

కామచేష్టలఁ జేయఁగ గడగినారు.

గీ॥ నడుము మొదలుగ మోకాళ్ళఁ గనుపడుండఁ

గాగరా గట్టిగాఁ గట్టి కడమ నున్న

దేహమంతయునుం జేటతెల్లముగనె

బయలుపరచిరి యామునిపజ్జ వారు.

వ=అంత పూర్వోక్తప్రకారము

కం॥ మునిమదికిఁ బ్రణవ మట్టుల

వినవచ్చిన గానరసము విని యాతండా

మన మూపఁ జాల కాతప
మునుఁ గూడన్ మాని కనులమూత ల్వెప్పెఁ.

సీ॥ పశువులుతిని యెడి పచ్చికమాన్పఁగ
సంగీతమాధురీశక్తిగాదె
రాజులచేనైనఁ జేజేలుజేయింప
సంగీతమాధురీశక్తిగాదె
తెలియనివానిచేతల యూపజేయుట
సంగీతమాధురీ శక్తిగాదె
సర్పముసైనను సంతసపరుపఁగ
సంగీతమాధురీశక్తిగాదె

గీ॥ గానమెన్నఁడు తావినఁబోని యట్టి
ఋశ్యశృంగుని కన్నులరీతియెఱిగి
మనసునంగూడఁ జేరియు మనసెరింగి
కన్నులారనన్నుంజూడఁ గల్గుడనియె.

గీ॥ వీనులకువిందు జేసియు వీనికన్నఁ
గౌరవస్థానమై యున్న కన్నులకును
విందుఁజేయకుండిన యవిగుందునంచు
వచ్చెనోయన రూపముల చ్చపడియె.

కం॥ మనమేనతీసిపోయెడి
దనుచును నీరెండుఁగలసి తత్క్షణమే యా
మనముంగూడ భుజింపఁగ
దనరెనసందోచెనంతఁ దాపసిమదికిన్.

వ=అయ్యవసరంబున

హంసధ్వని=చతురశ్రగతి

ప॥ ఎంతోధన్యుండనైతిమదికి।సంతోషమయ్యెనాతపముఫలియించె॥నె॥

అ॥ వింతయాఋషులపొంతనిల్చుటకు। దంతివరదుడునా చెంతకుఁబంపించె॥
మి॥ ఎంతకాలమీఋషులతపంబుల। దెచ్చుట.జేసిరో శృంగద్వయముండె॥
చ॥ అరయవీరుపూసిన భూతియహా। యధికమైన తావినిచ్చుచుండెను
సరిగా నొక్క జడయల్లెనుతల। సంతసమునుఁ బుట్టించు చీరలును
మి॥ అరరేయీ వేదమే మొగాని। యానందము గల్గించెనా మదికి
నిరతమువీరలతోనుండగననుఁ। గరుణింతురే మొకను గొనగావలె॥ నెం
వ=అనుకొనియాకపటమునులతో ఋశ్యశృంగుండిట్లనియె

సీ॥ గడ్డముల్ మీసముల్ గాన బడవుమీకు
మీ దేశపుందీరమేనితీర
అతిరమణీయమై హితవుగఁగన్పడు
రెండుకొమ్ములవేల గుండెనుండె
నా చెంత తా రాదు క్రొత్త మలఁబోలిమీ
తలయొక జెడయయి యలరెనెటులు
మీభూతియేమిటఁల్మా భూతికంటెను
కమ్మతావుల్వెదఁ జిమ్ముచుండె

గీ॥ అయ్యనాకంటె మీకున్నయధికవిద్యఁ
గరపుడంచుఁ బ్రార్థించిన కతన వారు
పల్లెనైనఁజూడని వీనిపసమెచ్చి గి
యింకఁగొంతదూరము త్వర నేగినారు.

ఆ॥ పల్లెటూరినుండి పట్టణమేగి తొ
ల్దొలుతవింతఁగాంచు పొలతివలెను
ఋశ్యశృంగుఁడల్లయిగురుబోడులఁ గాంచి
వెఱ్ఱివానిఁ బోలి వింతపడుచు.

వ=పోవుచున్నవాఁడూరకొనకయతిమాయాపరవశునట్టులు

మంజరులు

1 అయ్యానాగతియేమిచెప్పి మీ ।రరుగుచుంటిరో తెలియా
కుయ్యాలింపక యేగుచున్నమిముఁ । గొనిరాగానాతలయా!
2 మీ వేదశ్రుతులైనఁ గొంచెమీ । నావీనులవిననిండీ
సేవచించువేదంబిటువలెనే । నెగడ లేదుతొలినుండీ
3 మీరుగట్టునారచీర నొక్కటి । బాజువైచివెడలండీ
మారవైరి దలచినట్లుమిమ్ముల । మనమునఁ గొలిచెదనండీ॥
వ=ఇట్లన
గీ॥ అందునొక చెలిపట్టుతా బండఁవిప్పి
పారవైచి ముందుంచిన పజ్జకుజని
గట్టిగామితాయిని ముందుగట్టియున్న
మూటవిప్పిధరించెనాముదిత మరల.
గీ॥ గాగరాయందు ముందుగ గల్గుమూట
విప్పియుంచుటచేతనా గొప్పగొప్ప
రుచ్యమైన పదార్థముల్ బుశ్యశృగు
డమగకుండఁగ నిచ్చిరాయూడువారు
మంజరులు
2 ఇచ్చినవాతండొక్కటి దినగని । ముచ్చటగవెడలినారు
చెచ్చెరతానుంగూడవారితోఁ । జేరి వెంటబడినారు॥
2 పోవునాదారిఁదూఁడను వెంబడు । గోవువలెవెడలినాడు
యేపగనైనఁ వీరిశుశ్రూషఁ।గావించెదనికనేడు॥
వ=అనివారివెంట పేదవాని పశువులం బందెలదొడ్డికి దోలుచుండ చూచి వదులుమనువానియట్లు
జంజూటి=ఆది
ప॥ న్యాయమహానె యీటులచేగ । నోయతీంద్రవరా నాసన్నువిడిచి॥ న్యా॥

అ॥ మీయనుగ్రహమునననున్నంగూడ। నేయరణ్యమునకైనదోకొనక॥న్యా॥

చ॥ సర్వమెఱింగిన మీరేయిట్టుల । సలిపినమాయింటివాళ్ళకింకే
తెరవుగాన వచ్చునటులొటచేఁ । దేవామిత్రోడ నేనువచ్చెద॥న్యా॥

2 పండులును నారచీరలు వింతగ । బరగుచుండె మీవేదంబేమో
నిండుసంతసం బపరిమితముగా । నిచ్చుచుండెమిమ్మొట్లువిడుతునే॥

కం॥ అనివేడుఋశ్యశృంగున
కనిరిట్టులు గడనకత్తెలతిగుంభనగా
మునిపుత్రమాకు నిచ్చుట
వినుమొకగడియైననిల్వవీల్పడదుసుమా.

గీ॥ నీకుఫలములు చీరలు నిక్కువముగ
కావలసియున్న మాతోడ రావలయును
వేదముం గూడనేర్పనీమీద మాకు
కరుణగలిగెను వేగమెకలసిరమ్ము॥

గీ॥ వచ్చిచెప్పినట్టులె వినవలయుసుమ్ము
చెప్పినట్టులవినకెటోచేసితేని
శాపమిడుదుము సుమియుకఁ గోపశాంతిఁ
జేయలేరుముమ్మూర్తులుఁ జేరియైన॥

మంజరులు

1 అనినవారిమాటలకు నొడంబడి ॥ యరుదెంచె ఋషివరుండు
కనిపెట్టియున్నరోమపాదుండు। జనిమహాత్మరారండు॥(అనిమెదురువచ్చి)

2 ఘనమౌవాద్యంబులతోఁ బిల్చుటఁ । గనఋశ్యశృంగు గుండె
వెనుకదినము పెనుస్వప్నముగనినటు ! లనుమానంబుగనుండె॥

3 మహాముని పాదమావంగదేశ । రహదారిలోనఁబడిన
బహువర్షంబాకుణమునఁ గురిసిన । ప్రజలుసంతసము పడిన॥

4 రోమపాదుఁడా ఋషిపాదంబుల । నేమముతోఁబూజించి

నాముద్దులపట్టినిచ్చెదనీకు । ననుక్షమింపుము దయయుంచి॥
5॥ నిను దెచ్చినవారు వేశ్యాంగనలు । నీకనుమానంబేల
ననురక్షింపఁగఁ దేవుడీత్రోవ గనుపర్చె సుగుణజాల!
గీ॥ అనుచు సర్వమునెఱింగించి మనుజనాథుఁ
డతని సుతయగు శాంతనుయతికినిచ్చి
నాగృహంబు నారాజ్యము నార్యయిటనె
యుండిధన్యతఁజేయు మఖండచరిత.

వ=అని ప్రార్థింప మన్నించె నో దశరథా! అప్పటినుండియు నాపుర మెట్లున్నదన

సీ॥ వత్సరమునమూఁడు పంటలుపండుటఁ
పేదసాదలటన్న పేరెలేదు
సకలదానంబులు సల్పుటచేజనుల్
తేజరిల్లిరి నలుదిక్కులందు
శాంతయదృష్టముఁజవులుగొనుటచేత
మరియింతయోగ్యులైమనిరిస్త్రీలు
తగవులుతంటాలధర్మవర్తనసున్న
మత్తుపదార్థ మన్మాటలేక
గీ॥ సరససంగీత పండితసత్కవీంద్ర
దీర్ఘవాణిజ్య కృషిసల్పుధీవిశాల
సారకువలయపశు వృక్షసస్యజాల
భరితమై యొప్పుచున్నదా పట్టణంబు
గీ॥ అట్టులప్పటినుండి యాపట్టణమున
ఋశ్యశృంగుడు మామయా రేనికిఁగల
కోర్కెఁదీర్పగఁ నిప్పటికుండెనచట
మనముఁ గూడనతనిఁదేగఁజనగవలయు.

వ=అనిన దశరథుం డపరిమితానంద కందళిత హృదయారవిందుండై.

కమాచి=చతురశ్రగతి

ప॥ హోయివత్తమురండయా । మునిపుంగవ్రకడుకుం బో॥

అ॥హోయిగద్దైనాఋషిచరితముఃవినన । హారోమపాదుఁడెంతధన్యుడో॥

1 మహామహామునివలెఁదో చెడునామది।మరిమరిమానినిజూడఁగోరియుఁక॥

2 తక్షణమేపుత్రకామేష్టినీ । పక్షంబున నెరవేర్పగావలయుఁ॥ బో॥

3 తనివిదీర కేనుపంక్తేరుకొను । చునున్నటు రాత్రిస్వప్నమయ్యెను పో॥

4 పిండివంటలెన్నో పెక్కుగనిట । వండియున్నఁ దనినట్లుకలగంటి। పో॥

కం॥ అనుచునుఁ బెక్కుహడావిడి
గనుబయనంబులనుఁ జేసికాంతలఁగని నే
జనివత్తుఋశ్యశృంగుని
గొనిరాగారేపెయిటకుఁ గోమలులారా.

కం॥ అనిపయనంబైవీటికిఁ
జనినారలో లేదోయంచు సందేహింపక
మనసేగునంత జవమున
జనియుండిరివంగ దేశసామీప్యమునక.

మంజరులు

1 రాజలాఛనం బగుటనుఁ గోటకు । రాయబారమునుఁబంప
రాజగునారోమ పాదుడువచ్చి । రానందరిం బ్రార్థింప॥

2 అందరును ముందు ఋశ్యశృంగముని।నంపుమనుచుఁబ్రార్థింప(పిదప)
రందరుంగలిసిఋషినిఁ బ్రార్థింప । నాకోర్కెనుమన్నింప॥

ఆ॥ రాజబంధువు లనురాగంబుతోఁజుత
నెంచియెంచి గౌరవించియుంట
భోజనంబులకును బూనివచ్చుటకును
అందరునును మోదమందిరాగ్ని,

3

గీ॥ వాయువేగముననె వచ్చియిల్లుంజేరి
వలసినట్టి తగినవస్తువులను
చేర్చిసుతులులేమిచే పుత్రకామేష్టి
మొదలుపెట్టిరంత ముదముతోడ

మంజరి

1 ఈకథయిట్లులనుండగనాకా। ధీశుడు బ్రహ్మనుగూడి॥ (దేవతా)
నీకముతోవిష్ణుపురికిఁజేరెను। నిగమవేద్యునింబాడి॥
వ=చనియామహావిష్ణుంగాంచి వినమ్రులై దీనవచనంబులతో

మంజరి

1 రావణుబాధలు బడలేకుంటిమి। రమ్మమహాత్మానీవు
చేవబోవకున్న నంద్రమునఁబడి। జేరెదయుక్రిందితావు
వ=అనిననమ్మహా విష్ణువుబ్రహ్మంజూచి
సీ॥ ఉత్తమదాంపత్య మొక్కడంబాపుచో
సర్గసంబంధముసమసిపోవు
సత్యచరితుఁడైన జనునిబాధించుచో
బ్రహ్మతేజంబున్న వన్నెచెడును
కూతువావింబెండ్లి గూర్చుకొన్నలైన
గౌరవప్రాస్వమా ఘనునికైన
మాయనేర్చినయెట్టి మహనీయుడైనను
నీచజన్మంబుల నెత్తవలయు
గీ॥ దైవమే చూచుచుండు నీతప్పులెల్ల
నింద్రుడునుగాధి సుతుడును నీవునేను
యోధులమటంచుచేసిన గాధలెయివి
పాపమోయనఁ బుణ్యముపల్కుటెట్లు.

వ॥ అనసిగ్గునొంది . కొంతసేపూరకొని మరల నా దేవతలు చేతుల జోడించి

శహాన—త్రిపుట

ప॥ బ్రతుకలేమోపరమపురుష । పతితపావన మమ్ముగావుము॥ బ్ర॥
అ॥ సతతముమాపై నల్లరుపై । సాగుశకట ముక్రియనువచ్చెను॥ బ్ర॥
మి॥ అతికష్టంబయ్యె మహాత్మా । ఆరక్కసుతోడన్నాకు
మతులుబోయెమమ్మాదారి । న్మనిపెదవోనీదే భారము॥ బ్ర॥
చ॥ తిండిదినుటకు వీలుగాదు । పండుకొనుమా మూలలేదు
రండునాపాదములబట్టుకడం । చండజమూనలంబట్టిబాదు॥ నీ॥
మి॥ మొండిబ్రతుకు బ్రతుకుటకన్నన్ । బండలమై యుండుటమేలు
దుండగీడువానింజంపగ । రండు వెడలి మాతోడన్నేడు॥ బ్ర॥
వ=ఇట్లన విష్ణువు బ్రహ్మంజూచి

మలయమారుతము ఆది

ప॥ సుకంబుగను యుం । టికిన్ జనుడు నేనికన్ వచ్చెదను విచారమేలను
అ॥ అకలంకచరిత్రుడుదశరథునకుపుత్రకామేష్టిసలుపు మొంను సమయము
చ॥ రావణునకునరము । లీవిచ్చునపుడు దేవదానవులచే వధింపబడి
పోవకుండగా గోరెనుగాని । చేపలేదనుచు నరులదలంపదు సు॥
2 నేను శేషుడును శంఖచక్రములు । రేనికికొడుకులుగా జనియింతుము
జానకిపేరున లక్ష్మిజనించును। వానరులైమీరు నవతరింపుడు॥ సు॥
వ=అనిచెప్ప

గీ॥ లాభమునునుగొన్న లోభితెరంగున
విష్ణుజెప్పినట్టి వింతవార్త
నాలకించియు పదమంటిమ్రొక్కిభజించి
దేవనీదుదయయె దేవతలకు.

మంజరి

1 అనుచు వెంటనే కిష్కింధకేగి । జనమొందిరందరును
ఇనకోటి తేజఁడగు నాహరినిం । గొనియాఁడుచు తొందరను

గీ॥ మఱలనీకథయిట్లుండ మనుజనాథు
పుత్రకామేష్టియుం గూడపూర్తియయ్యె
పాయసాన్నము బంగరుపళ్లెరమున
దెచ్చి పరమపూరుషుడొకఁడిచ్చి చనియె.

వ=దానింగొని దశరథభూపాలుడు.

గీ॥ పాయసాన్నము నాలుగు భాగములుగఁ
జేసి యగ్రసతికి పాలుదీసియచ్చి
యట్టులే కైకకున్గూడఁ బెట్టియున్న
మివులదంతయు నతఁడు సుమిత్రకిచ్చె.

వ=అంత

సీ॥ ఒకవైపు కైక వేరొకవైపున సుమిత్ర
వేవిళ్ళతోఁడను వేగుచుండ్రి
కౌసల్యయన్నముఁ గడుపులోశిశువున
కాకలియని విధిలేకదినును
కైకాసుమిత్రలు కానరాకుండఁగా
గర్భముల్ చీరలఁ గట్టుచుండ్రి
స్త్రీవైద్యులెందరో సావధానముగ నం
దరికి నారోగ్యముం బరికొలిపిరి

గీ॥ వైద్యగుణములచేతనో వారి పూర్వ
పుణ్యవశముననో లేకఁ బూజ్యుడైన
విష్ణుదయవలననో గాని వీలుగానె
కన్నసుతక ప్రసవమైరి గడుసుఖముగ.

మోహన చతురశ్రగతి

ప॥ కొడుకులుగలిగిరి యాదశరధునకుఁ ! గోరికదీరసంతోషమేర్పడగ

అ॥ బుడుతలుబుడతలటంచునెన్నియో ।యిడుములుపడినందులకుఁదగినట్టి

మి॥ పుడమిరేడొకడుగాక నయోధ్యా । పురజనులెల్లరుసంతసముబొంద

కడువిలువగలుగునగలు దశరధుని ! కాంతలుప్రీతిన్ మంత్రసానికిడ

చ॥ నవమిదశమియేకాదశలయందు।నల్వురుపుత్రులు వరుసగగలిగిరి

అవతారమూర్తులని ప్రజలందరు । నాశ్చర్యంబున్ బొందుచునుండిరి

మి॥ ఇవాళమనకిక థప్పళాలనుచు । నెల్లబ్రాహ్మణ్యమును కొనుచుండిరి

బవుగానన్నముదొరుకునని పేదప్రజలు సంతసముపొందుచునుండిరి

మంజరులు

1 శివశక్తియుక్తమగు నామమునుం । సిరికౌసల్యసుతునకు (భరతుడని)

యువరాజ్యభారమనుభవించు రెం । డవపేరిడిరి కైకసుతునకు

2 సర్వలక్షణవిలక్షితుండునని। పేర్వాచించిరిసుమిత్రాగ్రజునకు

సర్వశాత్రవుల జయించగలడని ।శత్రుఘ్నుడనుచుచిన్నకొడుకునకు

గీ॥ పేరులిట్లిడియును ప్రేమతోఁ బిల్చుచుఁ

గడుముదమున వారిగాంచుచుండ్రి

పేదపెన్నిధిఁగని మోదమందినయట్లు

పుట్టిగుడ్డి దృష్టిబొందునట్లు.

ఆ॥ యోగ్యుడైన పుత్రభాగ్యముకంటెను

ధరణిలోననుండఁదగినదేది

రెండవవిధముగను నుండెనేనియువాని

గుండెనగ్గికుంపటుండునట్లు.

వ=యోగ్యులైనపుత్రులకు తోడుసిరికూడ గలిగెనేని

గీ॥ రెండుగలిగిన వారలే దండధరుని

బారిదప్పుందురకొనుటఁకూఁ జెల్పనగును

పిండమిడసంతతియులేక భిక్షబెట్ట
ధాన్యధనములులేకున్నఁదరమెగడువ.

గీ॥ ముఖ్యమైనవిగద పుత్రభూవసతులు
సారమూలకంబైన సంసారమునకు
వానితోసత్యశౌచ సువత్సలతయు
పరులయెడగల్గినట్లైన భళియనదగు.

వ=అట్లుగాక

గీ॥ కొడుకులుండియు భాగ్యముకొఱతమైన
భాగ్యముండియు కొడుకులం బడయకున్న
బలముగలవాడు శూరుడై బరగనట్లు
శూరవంతుడు బలుడుకానేరనట్లు.

వ. సర్వైశ్వర్యములుం గలిగి ప్రీతిగా జూచు నాదశరథునిపుత్రులు

గీ॥ ఇంటనితరచోటుల ధనమెంతయున్న
కావలసినంతయడిగినఁ గానికొనరు
వెక్కసపుమాడలెన్నడు వినిసయిపరు
తల్లికనినందుకివియెగాతిగినపనులు.

గీ॥ విలువగలిగినమాటలే వీనులఁబడు
గూడగలిగిన చేష్టలే చూడనగును
చెడుగుపనులను జేయనిశిశువులగను
తల్లిదండ్రులె ధాత్రిలోధన్యతములు.

గీ॥ ఒక్కక్షణమైన మాయింటనున్నజాలు
నిట్టిబిడ్డలటంచును నెరిగినట్టి
యెల్లవారును నెదలలో నెన్నుచుండ్రు
కనక మేగృహస్థుడు పేర్మిగాంచకుండు.

వ=అట్టికుమారులకు

కం॥ రాజవ్యక్తికవిద్యలు
రాజనుసర్వంబునట్లు రాకుండినచో
ధీజనులు మెచ్చరెట్లై
నాజగమున గెలిసేయనగు నెల్లరచేః.

వ-అనున్యాయంబున

గీ॥ దినదినము వర్ధమానులై తేజరిల్లు
లక్షణాన్వితులకు రాజలాంఛనముగ
నల్పువిద్యలవన్నియు సద్యశంబు
గూర్చునట్టుల నేర్పిరిగురువులంత.

—సీతాజననము—

1 కొడుకులటుల సంతసంబుగూర్పగ। కులముద్ధరింతురనుచు
కడుసంతసమున దశరధరా జా।కన్నసుతులగనుగొనుచు॥

సీ అతిప్రీతి రాజ్యమునందరు పొగడగ
నేకష్టములేక నేలుచుండ
కుశికపుత్రుండొక కోరికతోడ న
యోధ్యకునరుదేరసద్యశుండు
వచ్చెనంచుం బ్రీతినచ్చెరువందుచుఁ
నమితసంతోషియైయర్ఘ్యమునిడి
పాద్యమునిడిమౌనిపాదోదకంబును
సిరమునందుంజల్చి చెప్పెనిట్లు.

గీ అయ్యమీదయవలన నాకమితమైన
పెద్దపిల్లలు నల్వురువెలసినారు
వారివిడలేక నెట్టులుండేరఁబోక
దర్శనమునకు రాఁగనేమరితినయ్య.

గీ॥ అనుచుఁ దనమదిలో నెప్పుడలరుచుండు
సుతచతుష్టయమును ఋషి చూచునంచు
వేగమేతోడికొని రండి యేగుడంచు
నాత్రమునఁబంపె బాలురమిత్రకులను.

వ=అంత నా రామలక్షణ భరత శత్రుఘ్ననామంబులు గల్గినయా

మంజరులు

1 నల్వురుపుత్రులు నడచుచువచ్చెడి । నా రాజసమును జూడ
నల్వురకైన వర్ణింపదరమెయున । నరుల వశమె కొనియాడ॥
2 నల్వురుపున్నమ చంద్రులేకమయి । నట్టులన్నెల్లుగూడ
విల్వలేని నరహాలుద్భవించిరో । వివరించరందరుంజూడ॥

వ॥ వచ్చినట్టి
ఆ॥ ఆత్మభవులు నల్వురాజికిముందుగ
పాదములకు మ్రొక్కి వచ్చినట్టి
కౌశికునకుఁ గూడకడుభక్తితో వంద
నములుజేసి దీవనలనుఁ గొనిరి.

మోహన=చతురశ్రగతి

ప॥ నల్వురుపుత్రులునాగ్గాసనముల।నతియొయ్యారముగాగూర్చొనిరి॥న॥
అ॥ విల్వలేనిరత్నాభరణంబులు । వింతమైనకాంచనవసనంబులు
మి॥ తల్వారులు రత్నంపుపిళ్ళతో । తళతళమని కాంతిపుంజములుగా
చెల్వొందుహస్తములధనస్సులును।జిలజిలమనుముద్దుటుంగెరములతో॥ న॥
చ॥ చిరుచిరునగవులఁ జూచియందరును।పరమానందమునొందుచుండగా
మురియుచుదశరథుడుగాంచుచుండగ. । సరసిజాక్షులుపీవనలువైవగా
మ। పరమమోదమునవాతోపేరలు । బరతెంతురనుచు కౌశికుడుపొంగ
పురజనులప్పుడుచూచినప్పటికి । పునర్దర్శనమునభిలషించగా॥ న॥

గీ॥ ఏక మూర్తి ముమ్మూర్తులుగాక మున్ను
యెట్టులుండెనో యెవ్వరికెరుకగాని
రామమూర్తినిఁజూచిన యేమనుజుని
కైనఁ జ్ఞప్తికి వచ్చునావైనమెల్ల.

కం॥ తక్కినమువ్వురిఁ జూడఁగ
నిక్కపుమూర్తిత్రయంబె నెలకొల్పును గా
కెక్కడఁ జూచిననంతటి
చక్కని గుణవంతుల విధి సలుపం గలడే.

వ= అనివాక్రుచ్చుకొను జనులు

ఆ॥ నాటకంబునందు నీటగు వేసము
లరుగుదెంచు నప్పు డలరు ప్రజల
రీతివింతగనిన భాతిని జూతురు
గాని మాటలాడఁ బూనుకొనరు.

వ= అంతవిశ్వామిత్ర మహర్షి దశరథచక్రవర్తిఁ గాంచియిట్లనియె॥

బెంగాల్‌తోడి-రూపకం

ప॥ కడువెఱ్ఱిసుతులు గ్గిరి । కనుగొంటిని దశరథనే॥ క॥
అ॥ యిడుము లతిగఁ బొందెదవు । బుడుతలనుగురించినీవు॥ క॥
మి॥ జడదారులకష్టంబులఁ । గడతేర్చెడువారలునీ
కొడుకులుగాఁ బుట్టున నెడి। కోరికతో మేముండగనీ। క॥
చ॥ ఇంతమాత్రమున నేదో । దృష్టిశగులునని యనుకొంటివ
సంతతిలేకలేక గను । సరణినిగనుపరచితివినీ
మి॥ యంతరాత్మ నెంతముదంబనుభవించు చుంటివా నే
నింతమాత్రమెఱుగకున్న । నెట్టులింతవాఁడనైతి॥ క॥

వ=అనన్ దశరథుడువిన మ్రుడైమునింగని॥

సీ। ఎవరిపిల్లలు వారికెంతయో ముద్దని.
మీరెరుంగరటంచు నేరు చెప్ప
యోగ్యులెప్పుడును నయోగ్యులం గూడను
స్వాభావముగ మంచి వారలనరె
అందులో మీకునాయందుండు దయచేత
నిట్టులనుటకు నింకేమి కొదువ
మీయనుగ్రహమున నీయవివేకులఁ
ఘనులుగా దీవింపఁ బ్రణుతి సేతు.
గీ గానియోమహాత్మ యేమికారణమున
నరుగుదెంచిరి మీరని యడుగకుండ
కాలయాపనఁ జేసితిగాన నాదు
తప్పుక్షమియించి వేగమె చెప్పుమయ్య.
వ=అనవిశ్వామిత్రుఁడు
సీ॥ నేనొకగొప్ప కార్యానురతుండనై
కారణంబున నిటుచేరినాఁడ
గడపలోనికివచ్చి తడయకముందునఁ
గక్కులకక్లైనఁ గట్టినావు
అప్పటినుండి నాకటుగాని యిటుగాని
నోరును మెదుపగ భారమయ్యె
ఋషినిగదా లోకకృషికోసమేఁ జేయు
కార్యమునీవునుం గావవలయు.
గీ॥ ఘృణవధూభర్త లట్టులుగాపకున్న
లోకములు తప్పకనుఁ బాడుగాకయున్నె
అడిలెప్పనివాడ నిన్నడిగినట్టి
దెద్దియున్ రిత్తపోదనియిటకురాక.

సీ॥ గానసీవు గూడఁన్ గృహనూనుమయ్య
చేరిలోకులఁ బ్రీతిరక్షింపవయ్య
రాజధర్మము నిలుపుట సాజమయ్య
నీవటుల జేయకున్నను నిల్వమయ్య.

వ=అనదశరథుడు॥

మంజరులు-శంకరాభరణము

1 పరమేష్ఠితుల్యులగు మీరిట్టుల । బలుకన్యాయమే యార్య
హరిశ్చంద్రుఁగోరినదిగాకేది । యైననిత్తుమునివర్య॥
2. అదియైననేన యేలుటకుగాదు । ముదముతోఁడరాముండు
సదయుఁడై యేలుచుండుటఁజూడగ । నన్మనినామనముండు॥
3. రాజధర్మమునుఁ దప్పనీకమీ । రేదియైనఁ గోరుండు
ధీజనులు మెచ్చుచుండునట్లునే । నేజేయనొప్పియుండు॥
కం॥ కానిపని యేదియైనం
బూనుకతమవంటి వారు బుత్తెంతురెయో
మానివర యేదియైనం
గానీయర్థింపుమిపుడకైకొన నిత్తున్

వ-అనురాజుతో కౌశికఋషి

సీ॥ ఏదినీకుఁ బ్రీతియో దాని నడిగెద
నేదారి ద్రొక్కెదవో దశరథ
ఎందేగుటకు నీకుసందేహమున్ గల్గు
నందువో దానినే నందసుంటి
నందరికినోర్మిద మంద జేసెడిదేది
యందునె నాపని జెందియుండె
నేదినీకుడి ప్రక్క దేదీప్యమానమై
భేదంచె నామది నీదిసముస

గీ॥ నట్టిరాఘవు స్నేహము బట్టనుంటి
నెట్టులైనను గాని నాచెట్టబట్టి
మమ్ముబాధించు రక్కసి ద్రిమ్మరులను
జంపుమని చెప్పమారాముఁబంపి నీవు.

ఆనంద భైరవి మిశ్రజాతి

ప॥ ఎందుకంటివయేసియెల్లరక్కసులు మ । మ్మోటుమెదలనీయరోరాజ॥
అ॥ సంధ్యావందనమైన సరిగసలుపగనీరు । అందుండలేమయ్యా రాజ॥
చ॥ శపియించుటకునైన దపముతరుగునని । శంకగల్గుచునుండె రాజ॥
కృపతోడనీవుపుత్రు నిపుడుఁబంపితివేని। యుపకారమగునయ్యరాజ॥
2. రక్కసిమూకచేఁ బెక్కుదినములనుండి। ఇక్కట్టొందుచునుంటిరాజా
నిక్కము శ్రీరామునక్కడకుఁ బంపిన । చక్కంజేయంగలఁడురాజా
మి॥ యిక్కుమారుని నాసుతునిగా । నింపుగా జూచెదను సుమ్మా
చక్కగానేర్పెదను విద్యల । జాగుసేయక నాజ్ఞయిమ్మా॥ యెం॥
వ-అయ్యవసరంబున॥
సీ.॥ దశరథుడధ్యక్షుని సమానముగనుప
కార్యదర్శుర యట్టులార్యులుండఁ
దమతమ విద్యలఁ గమనింతురనివచ్చు
కార్మికులట్టులఁ గవులుగూడ
కార్యనిర్వాహకుగతి వసిష్ఠుండుండ
కార్యబోధకు నట్లుగా సుమంత్రి
వెలయఁ బ్రేక్షకులంత వివిధదేశంబుల
నుండివచ్చిన యట్టులుండవినఁగ
ఆ॥ రంగసింహ మన్న రంగుగ కౌశికు
డందుపన్యసించు చందమరయ

సాలుసాలునకొకచక్కి జరుగుచుండు
నాంధ్రసభలవోలెనలక్షియుండె.

వ-ఇంట్లుండ నచ్చటి ప్రేక్షకులువ్విళ్లూరుచు కౌశికుని యుపన్యాసము మేనులుమరచి వినుచుండ.

ఆ॥ ప్రజలయెదుట నొప్పబడిన యధ్యక్షుండు
తనకు వల్లగాని పనినిగూర్చ
చేయలేక సిగ్గుచేతజసాధింపగ
బాపరుతీరుదశరథునకుఁ గల్గె।

సీ॥ పుత్రునింబంపఁగా బూనిపోదుబుద్ధి
యనృతమాడగ యోచింపన నలెజనదు
ముందరుగగోయి వెనుకకుంబోవనూయి
సుతునిఁబంపుటా లేకఁ దాపతితుడగుటా.

వ. రెండువిధముల మనన్సు కొట్టకొన నారాజపుంగవుడు ముని పుంగవుం జూచి.

జంఝూటి-తిశ్రగతి

ప॥ కొడుకుల విడిచినే గడియమైన నుండెదనా । కడునిడుమలఁ బడి గాంచితి తుదకు నా॥

1. అయ్యా శ్రీరామునకు నెయ్యిమధికము నాతో । చయ్యన మీతో రాగసాహసించునా చెప్పుడీ ॥ప॥

2 నేనేవచ్చి రక్కసులబూచికతో చంపెదను। గాననన్నుఁ గరుణింపఁ బూనుమయ్య రాముగోరక॥

3. అన్నపానములకు నదనుగుదురునో లేదో।మీరెన్ని చేసినఁగానియింటి సుఖము వచ్చునె.

4. రాజకార్యములరయు నాసమయమున నైన।రాము మనోనేత్రమున నేమరుపసుమ్మా.

5. విడువదగినంత గట్టిబుడుత డారాఘవుడు। నుడువు మైసరిగ రాదా చెడు
గుల నేమి సేయు ॥కొ॥

వ. అను దశరథునిం జూచి విశ్వామిత్రుండో రాజా మీవంశజులైన సత్య
హరిశ్చంద్ర నల భగీరథ శ్రీయాళ ప్రభృతిభూపతు లాడితప్పవలసి
వచ్చునని యెంతంతఘనమా కష్టకార్యములంజేసిరో నీవ యెఱుం
గుదువు నీవును సామాన్యుఁడవుగావు పుత్రప్రేమచే నిట్లనుచుం
టివి కొంచెమాలోచింపుము నీపుత్రుని నాకుఁ బెంపిమ్మనలేదు.

గీ. రాముఁ డారక్కసులఁ జంపిరాఁగలండు
కొద్దిరోజులలోనె నావద్దఁబడ్డ
వెల్తిఁ బూర్తిఁ జేయుదువులే వేగ వెంట
బంపుమా రామునకు నేమి భయములేదు.

మంజరులు-కళ్యాణి

1. అంతనామాటనీకు నమ్మకం। బనిపింపకున్న గురుని
యెంతవాడు రాముండని యడుగుమి ।యెరుకపడెడు నీతరిని॥నీగురుని॥

2. అంతవసిష్ఠుం డాదశరథభూ । కాంతుప్రక్కగా నిలిచి
సంతోషముతో రామునిఁ బంపుము। చంపురాక్షసులఁ గలచి.

3. అదిగాక వేరెయుపకారంబుల ! నందివచ్చునీసుతుడు
యిదియేతగు సమయంబీయనతో । నేగుమని జెప్పుమిపుడు.

వ. అనుచు వసిష్ఠభగవానుం డుభయోపయోగంబులగు పల్కులం
జెప్ప దశరథుండు వెలవులంబోవుచుఁ గుశికపుత్రుం గనుంగొని
యో మహాత్మా.

గీ. తనగురువుమాట వినెనని యనుకొనకుడు
ధైర్యమాపాటిలేక నేదడసినాఁడ
కొడుకుఁ దీసుకవచ్చి నాకొప్పజెప్ప
పరకుఁ దండ్రిబిడ్డలయిట్లు పరగవలయు.

కం. నాపంచప్రాణంబులు
నీపాపనిచేత నుండు నిక్కముహా సీ
కోపంబుంచక వేగమె
నాపుత్రునినాకు నప్ప నమ్మెదుమనఘా
వ. అనిన మానిరేనింగని ద్వార్థిగా నర్థమువచ్చునట్లు!

తోహారలు-ధన్యాసి

1. ముందున్నదింక ముసుల్లుపండుగ। తొందరపడకో రాజా
యెందుకీరీతి తొందరరాము౦ । డెందేగడురవితేజా.
2. పయనముమాత్రము వేడేయింపుము ! పార్థివోత్తమా నీవు
భయముగల్లె నారక్కసులవలనఁ । బ్రాణములిచ్చుటలేవు.
వ. అను మునివచనంబులవిని దశరధుడు రామునిం బొమ్మని నేత్రసంజ్ఞ
జేయ!

తోహారలు-మోహన.

1. తండ్రినేత్రములచేఁ బొమ్మనిమెదు । తాత్పర్యంబును నెఱిగి
గండ్రలైన రక్కసుల దునుముటే ! గలిగెననియు దము బెరిగి
2. లోనికేగితల్లులతో నడవికి । నేనేగెదనని చెప్ప (మనుజుని)
తోనెయున్న ఛాయవలె లక్ష్మణుడు । వీనికిదోడైయొప్ప॥
వ. అతిత్వరిగతిని.
సీ. తిరిగిదర్బారున కరుదెంచు తనయులఁ
జూచిచూచియు మోమువాచినట్లు
తక్షణమే వారిదరికేగి లక్ష్మణా
గురువు సన్నయు జెప్ప తెరగునపిను
మని దేవిడీదాక ననిపి రామునిఁ జేర
దీసి యింకొకమాఱుగాసిఁ జెంది.

తిరుగలేక యెట్లో తేలెదు కాళ్ళతోఁ
జేరలేకసభకు జేరువరకు

గీ. తనకుమించిన వగచేతఁ జనులుఁగూడ
జేరలేకయె దర్బారు జేరుసరికి
వెలవెలం బోయెనా సభానిలయమెల్ల
నడుమ మణియాడుహారము నాఁబరంగ

వ. అంతవిశ్వామిత్రిమహర్షి.

బిలహరి-ఖండగతి

ప. దశరథుని దరినుండితప్పకొని కౌశికుడు । వశముగానట్టి సంతసము
నఁ బొంగుచును

అ. పసివారిఁ జూచునట్లీబాలురనుజూడకను । పరమపూజ్యులఁ బోలె
భావించుచుం దనలో

మి. ముసిముసినగవులును పసగలనడకయును । రుచిగలచరితంబులువచి
యించుచు బాలురతో.

చ. లోకమున కాధారమూ కమలగర్భుడే । నాకుశిష్యుండయ్యె నాపు
ణ్యమే మందు
చీఁకటికి నేస్తులౌరా కాసులందరిని । చీల్చిచండా డునీశ్రీహరిప్పకను

మి. నాకీర్తియుగూడ నాచంద్రితారకము । లోకులెల్ల జెప్పకోనుందు రె
యికను॥

వ- అనియపరిమితానంద దాయకులగు న్శ్రీరామలక్ష్మణ నామంబు
లం బరగు దాశరథులతో నానందంబున నోలలాడుచు నేగుచుండ నా
నాయోగ్యత్రయం బెట్లున్నదన

సీ॥ కోదమసింగము వెంటఁ గూడివచ్చెడి చిట్టి
కూనలయట్టులఁ గొంకులేక

ఎఱ్ఱగులాభీకి నెదుటఁ జేర్చినయట్టి
సంపెగ చామంతి సరణిఁదోఁప
నీలమౌక్తికముల నిరుతట్టులంగూర్చి
మధ్యమాణిక్యంబు మాటినట్లు
దేవగురునియొద్ద దేవేంద్ర చంద్రులు
వినయసంభ్రమములఁ బెనఁగుమాడ్కి
గీ॥ కౌశికునితోడ రామలక్ష్మణులుఁ గూడ
స్వర్ణమునకు హత్తించినవజ్రమువలె
వజ్రసమ్మిళితంబైన పైఁడి పోల్కి
నొకరివలన నొక్కరికాంతి ప్రకటమయ్యె.
గీ॥ అటులపిచ్చపాటిం జెప్ప చరుగువెంచు
సమయమున భీకరధ్వనిజరిగినట్లు
వినఁబడినయంతనే మునికనెనిటునటు
వెనుకవారుండిరను ధైర్యముననుఁ గూడ.
వ॥ అట్లువినుచు నెదుటికిఁ జూచుసరికి॥
సీ॥ జారుపిరుందులు భారమౌ పాలిండ్లు
కోరదంతంబులు కోసుగోళ్లు
కుండవలెన్నుండు కుఱుకునల్లనిబొఱ్ఱ
చుంచులమార్గమున్నించు ముక్కు
రంధ్రంబులుఁ ఖర రవము మించెడి కంఠ
రవమునునల్లనిరంగు నోరు
పెడకాళ్లు నాభినివిడిచిన కట్టును
అప్పవలెందలరుసరుసలను
గీ॥ జూపుమోమును బరువగుమూపుగుడ్డ
క్రూరమౌ చూపుచాపునఁ గోరుకళయు

నీనినట్టి వరాహాంబుపూనికయును
రవిన్నిమింగగ నరుదెంచు రాహువగిది.
వ= వచ్చునదితాటకిఁగా నెఱింగి రామునిఁజూచి

ధన్యాసి—చతురశ్రగతి

ప॥ రామా రామా వచ్చుచున్నదీ । రక్కసిగనుమునీవు
అ॥ సామజములు నూరింటికున్న బల । మీమనుజాసికిగలదో రామా॥
చ॥ బ్రతుకనీదు మమ్మీయరణ్యమున । భడవామంచిదిగాదు
అతికష్టంబయ్యెనునీనిఁతోడ । ననయంబు! చావబాదును॥ రా॥
2! దీనితోఁడమారీచుడుగూడిన । వేన్నికైన భయమేను॥ ఓ
భానువంశజలధి శశికరుణను । మానిచంపఁగా బూనుము రామా॥
3. ఋత్విక్కులుదీనిగన్నదిమొదలు । ఎరుగరన్న మోయన్నా
సత్వరముదీనిఁజంపకున్నచో । సకలకార్యములుసున్న ఓయన్న॥ రా

తోహార-సురట

1. అధర్మమున కొడిగట్టినాఁడు ముని । యధమాంశమైన స్త్రీని
వధింపుమని యాజ్ఞయిచ్చుచుండెను । వనిశయనెడికృపమాని॥
వ-అనియనకొని విశ్వామిత్రుంజూచి శ్రీరామచంద్రుడు॥

దిండి

1. ఎన్నఁడైన స్త్రీలంజంపుట । మెరుగుదునా
నన్నిట్టిపనిని జేయుమనుట । న్యాయ్యమేనా॥
వ-అనఁగార్యభంగ కారణంబున విశ్వామిత్రుఁడు కించిద్భయకారణుండై
రామునితో॥

దిండ్లు

1. రామాయిదినూరుగురు । రక్కసుఁను
నేమిా మొదలకుండకొని వేయఁగల్గను॥ శ్రీరామా॥

2. మగవానిధిక్కరించినమాగువంజంపిన
నగచాట్లబ్బవు పాప । మవిదూనాయనా॥ యోరా॥
3॥ అందులో క్రూరరాకసి । యంత మొందిన
నెందరోసుఖియింత్రు పుణ్య । మింతకన్న నా॥ రఘురా॥
వ॥ అనిదశరథ సూనుతో మౌనిబలుకుచుండ
గీ॥ ఇంతలోఁదాటకియు వీరినెదురుకొనుట
రాముబాణమ్మురిప్పౌన రవముగొనుట
తాటకీ వక్షమున నమ్ము దగులుకొనుట
మెదలలేక రక్కసియు సురపదలుకొనుట.
వ॥ తదుపరియారామలక్ష్మణ కౌశికు లాశ్రమమునకు
ఆ॥ చేరిభోజనములఁ జేసి కూర్చొనినంత
వేదపఠకులెల్ల వేగిరంబ
యజ్ఞశాలనుండి యరుదెంచిరాముని
కుశికపుత్రుఁ జూచిగొల్లుమనిరి.

నాదనామక్రియ త్రిపుట

ప॥ అంతరాముఁడు వారిపై చెయినిడి ! యెంతమాత్రముభయములేదని
అ॥ సంతలక్ష్మణుడిచ్చు విలుగొనియు । నతిరయంబున శాలకుజని
మి॥ పంతంబునవచ్చినట్టియా । పతితులపైఁబాణంబులేయ
కొంతమందిచావఁగలిగిన । క్రూరులువెన్నిచ్చిపరుగులిడుచుండిరంత
చ॥ పరమాఱల దెంతపొగరు । మీరియున్నను తాపసులనె
సాజెసారెకుఁ బాధపెట్టుట । నేరమని యనిపించలేద
మి॥ కారణంబులేకన్వారిని । మేలుమీఱిబాధించునట్టి
మీరలేమిగానున్నారో । రారండన నొక్కడుఁ గన్పడకుండె। న॥
గీ॥ తమ్ముడాజాగరత యని తానువచ్చి
తాపసులకు మహాత్మ్యమాపాపుగొందు

గానరాదిక రావచ్చుగానవచ్చి
మీపనుల్మీరు నెఱవేర్చిమేలుకొనుడు.

తోహరాలు-ధన్యాసి

అనినయంతఋత్విక్కులు ఋషులును । విసనంతోషంబునను
ఘనముగఁదలపెట్టియున్న సవనము । గాఁజేసిరి పూర్తిగను॥
2. తదుపరికొన్నాళ్లు విద్యనేర్పఁగఁ । దాఁపసి బాలురనాపి
ముదముతోఁడ నొకనాడువారలకు । మిథిలవైపుఁ బేల్లూపి॥
సీ॥ రాఘవాయిటువైపు. రాజిల్లు మిథిలయ
స్పట్టణమొక్కటి ప్రతిభఁగూఁడ
వినియిందు నీవును జనకరాజధిపతి
యతనికిఁగలదొక యాఁడుపిల్ల
నీవుశాపంబుంట నెఱిఁగజాలవుగాని
యాదిలక్ష్మియె సుమా యదిదేవ
జ్ఞప్తికిందెచ్చుకో తప్తకాంచన తేజ
నీవెఱుంగనిదేది నిరుపమగుణ
గీ॥ యనుటరాముఁడు చెప్పదు వినెదననుట
వేదమున నుద్భవించిన వేదవతియె
రావణుని వంశమంత మూనల్లునేయ
సీతయైజనించినరీతిఁ జెప్పఁదొడగె.
వ-ఓహాత్మా
గీ॥ ఆదిలక్ష్మిలో సగభాగమావనితయె
పరశురాములో సగభాగమీవె
నీవెచేసిన చిత్రముల్ నీవెమరువఁ
బ్రజలమగు మాకు జెప్పఁగ వలనుపడునె.

తోహారలు

1. ఐనను జెప్పఁగ బూనితిఁగాపున ! నాలకింపుమోరామా॥
మానిరు శధ్వజుడు వేద మతి ర ।మ్యముగఁ బఠించుజిత కామా॥
2. వేదమంత త్రుణ్ణముగాఁ జదివెడి । వివేకిలేడోరామా (యా)
వేదపఠన ప్రభావముచేతను । తెలసె వనితయఁదిభీమా॥
3. ఆ వెలసినసతి బాలగాక విను । యావనపతియోరామా
కేవలమా వనితకొరకు విఫలొక । భావమొదవెగుణధామా॥
వ-ఓకౌసల్యా గర్భశుక్తిముక్తాఫలావిను మాంకాంతలావణ్యా రూపవి
శేషంబులంజెప్పెద

బెహాగ్ తిశ్రగతి

ప॥ కాంతను నుతియింపనా । వంతుగాదురామా
అ॥ దంతివరదు సుతుడైనను । తగునోతగడో నుతింప॥ కాం॥
చ॥ దంతివంటి నడకలు । యెంతోమంచిమాటలు
సుంతయెవరికష్టమైనఁ । జూచిసహింపని డెందమా॥ కాం॥
2. అతిమధురములో పలుకులు । మితమౌసంభాషణ ను
సున్నితమా భోజనము నమిత । కుతుకము సంగీతమందు॥ కాం॥
3. తెల్లతామరలగాదని ! యుల్లసిల్లునేత్రంబులు
కల్లయనెడి మాటరాకఁ । గమసత్యములో పలుకుల॥ కాం॥
4. మృదువౌతామరలకంటె । మదవతిమేన్మెనువుసుమా
ముదమునఁ బెద్దలపూజయు । మధురాహార ప్రియయగు॥ కాం॥
5. నూవుపూవ్రతీరుముక్కు । శీఘ్రమైనపళులనొక్క
యేవిధమునన్నైనహారిసె । భావంబునంగలఁగద్రొక్కు॥ కాం॥
గీ॥ మాటవినయవిభవముల మరుగుపరచె
తనువు సౌందర్యమంతయుఁ దాచుకొనెను

శాంతవచన సౌందర్యముల్ చాలుననఁగ
యామెమూర్తిభవించె నంచనగవచ్చు.

వ-రామాయాకాంతమెప్పను జనరక్షకుండైన శ్రీహరినేగొనియా జగద్రక్షకుండైన యావిష్ణువే పతిగావలెనని ధ్యానము సల్పుచుండ నొకరక్కసివచ్చె॥

గీ॥ వానిపేరుదంభాసుర దానవుండు
కానిపోని దుశ్చేష్టలఁ బూనువాడు
ఋషులకందరికింగీడు విషయుతుఁడయి
గలుగజేసెడి రక్కసిఖలుఁడితండు.

వ-అతండీవేదమం దుద్భవించుటఁజేసి సార్థకనామురాలగు వేదవతిని॥

కం॥ కనుఁగొని నంతనె యతఁడా
వనజాక్షినిఁ గూడియుండ వలెనని యెంతో
పనిబూనియడిగెనిట్టుల
కనులఅమూయుచును మోహకలితుండగుచున్॥

బెహాగ్-జల్వా

ప॥ కాంతరో నీకుపతి । గలడాలేడా వచింపుమో॥ కాం॥
అ॥ ఇంతరూపవంతురాలివి ని । న్నెట్లు వీడినాడో కాం॥
చ॥ కోమలాంగినీదుజత । నీమఁగడె బాసెగాని
యేమనుజుడెట్లు నిన్ను ! వీడిపోఁగల్గునె॥ యో కాం॥
2. అన్నపానము లేలనో । వన్నెలాడినీవుగ్గ
సన్నుతాంగినిన్ను వీడిన । చపటయింకేల నే॥ కాం॥
3. నన్నుమన్నింపుము । నిన్నుఁబ్రీతిఁ జూచుచునే
వన్నెలాడినైననుతల । దన్ననట్లు జేతునీచేత నె। కాం॥

వ- ఇటుపరవశుండై ప్రేలుచున్న । రక్కసునిగాంచి వేదవతి॥

కం॥ అన్నానాథోనిట్టుల
మన్నన కెడమైన యట్టి మాటాడకుమా
నిన్నన్నయన్న యందును
సన్నుత పాత్రుండు హరియె సాక్ష్యము సుమ్మా॥

వ- ఓయన్నా నేనవివాహితను నాకీజన్మమున వివాహము కాదు ఈ జన్మము బ్రహ్మచర్యముతోడ నే నసించవలయు నిదియొక చిత్రకథ క్షమింపుము నేకుశధ్వజుని సుతనని చెప్ప॥

గీ॥ అగును యెల్లవనితలిల్లె యాడుచుందు
రెంత ప్రీతి పూరుషునిపై గంతులిడిన
నందులో యౌవనివిసీవు సందులేని
మోహనియవు ప్రీతేల లేకయుండు.

బారువ-చతురశ్రగతి

ప॥ స్త్రీస్వభావమే నెరుగుదునూ । చెలియా బహుజనులజూచినాడను॥
అ॥ ఆస్వరూపనామనాశకునిసీ। వాగొప్పగనుగొనుటో వెఱ్ఱిదాన। స్త్రీ॥
చ॥ నీతిలేక నుండువాని సతియును । నిత్యరోగియా వానిభార్యయును
ప్రాతమగని క్రొత్తయాలియునో । నాతిపతిలేని యౌవనాంగియు
మి. మాతలవలె పైకిం గాన్పించుచు । నీతిలేని నీచమానవులతో
మాతులంట మాటలాడుదురు నీ । కోతలునావద్దనాగోయు ట॥ స్త్రీ

వ- అననాకుశధ్వజసుత నిష్కాపట్యముతో!

గీ. అన్న నీయనుభవమున నంతెగాని
మించి తెలిసికొనిన యట్టి మేటివీవు
కావుగావున నంతియెగాని మిగత
నున్నయుత్కృష్టదశ యెట్లునిన్ను జేరు.

గీ. కనుము సామాన్యముగమించి గాంచుటన్న
నెంత యోజ్ఞాన దృష్టినిమించవలయు

కష్టమణువంత జేసిన గంపెడంత
ఫలముచేకురుకెట్టుల భ్రాతవినుము.

సురట చతురశ్రగతి

ప. తెలిసీతెలియనివానికన్న । నెలియని వాఁడేమేలన్నా.

అ. తెలియనివానికిఁ జెప్పిన వినుకొను ॥ పలువిధముల లాభమునుం బొందును॥

చ. తెలిసీతెలియని మనుజుండెప్పుడు ॥ త్రిశంకుస్వర్గమున నేయుండును ఫలముఁబొందువాడెప్పటికైనను।.బరులమోశలభ్రాతృభావముంచును.

చ. పరసతులను జెరుపఁజూచువాడీహ। పరములకునుదూరమౌనుసుమ్మా పరధనమునపర గౌరవంబులను । పాటింపనివాడిట్లెసుమ్మా

చ. పరసతులను తల్లులవలెఁజూచుట ।పలికిపొంకకుండుట పెద్దలఁబహు కరుణతోఁడఁజూచుట పెద్దలమెప । కపటబుద్ధిలేకుంటమంచిదని. తె

ఆ కాన నీవునన్ను మానవతిగనెంచి
సోదరివలెఁ దయను జూడుమన్న
నేను విష్ణుఁదక్క నితరులఁ గోరను
మంచిబుద్ధిగలిగి మనలుమన్న.

శోహరాలు-ధన్యాసి

1. అనియిటు లెన్నివిధములం జెప్పిన ! నారక్కసుంతువినక
పనివడి కుశధ్వజుని చెంతకరిగి । పలికెనిటు పాపమనక.

2. ఓరి కుశధ్వజ నీకూతు నా।కొసఁగెదవా మారనక
బీరకాయపీచువలె మనమమిత । ప్రీతినుండెదము గనుక.

3. లేదంటివేని చెప్పుమిపుడే। పోదు నిన్నుఁగడతేర్చి
నీదు తనయ నిప్పుడె నేఁ గొనిమోద । నెట్లైన మరిమార్చి(యు)

4. పల్లెటూరిలోన పలుకబడిగల । పరమనీచుడొక్కండు
చిల్లరవాళ్ళం బాధించుపట్లు । జేసె నారక్కసుండు

5. పిల్లనిఁజూచిన యెలుకచందమున । పిరికిపడకుశక్యజూడు
మెల్లఁ గదంభునితోఁడ నిట్లనియె। మించువేదపాఠకుడు.

సీ. దంభాసురావినుతగని కోరికయిది
మీకు మాకెప్పుడు మిత్రగుణము
గలుగ వినముగాన కానట్టికోరిక
కోరిలేదనిపించు కొనుట కంటె
నూరకొనుటమేలు మారుమాటాటకు
నీకుఁ గావలెనన్న నెలతుకల కె
లోట! మాపిల్లకు లోకరక్షకుడైన
హరియందునవె ప్రీతి యలముకొనియె

గీ. గానవే నెన్నివిధములుగా వచినను
వేరొకని వివాహమ్మాక నేరవనియె
తన్ను వలవని కాంతను తలచుకంటె
నీచమొద్దైనఁ గలుగునే నిసిచరేంద్ర.

కన్నడ-త్రిపుట

ప. ఎందుకూ దంభాసురానీ। కింతులేలేకుండిరా । లోకమున ॥ఎ॥

అ. సుందరాంగులెందరో నిన్ను।జూచి సంతమోహింతురిను ॥మొ॥

మి. ఇందు నిన్ను నిందించుటగా। వంచను సాగసెరుఁగనివాడవని
సందియంబు మానుము చెల్లెలి । సరణినిఁజూడుము మావేదవతి.

చ. వేదవతి జాతకముఁ జూడఁగ । లేదు పతియోగ్యత యీజన్మలో
నేదియైనను ఋణములేక । నెట్లు చేకురునయ్యా చెప్పుము.

మి. సాధువుల యిు మమ్మెంచుంకి। బాధలో బహదోసెగలో
యోధాగ్రేసర చక్రవర్తి । నీదయమాపైఁ బూర్ణింపు ॥మొ॥

వ. అదిగాక దంభాసురా మఱియు.

సీ. పిలువని పేరంటముల కేగుటొక్కటి
వలవని వనితను దలచుటొక్కటి
యడుగుచుండినయట్టి యప్పునుదీర్చక
మరల నప్పుం గోరనరుగుటొక్కటి
ఛీఛీయనెడువాని జేరుట యొక్కటి
కోరని పెద్దగా జేరుటొక్కటి
లోకువవానిపైఁ గేకలువేయుట
కొట్టబోవుటయును కొట్టుటొక్కటి
గీ. కూలికైవచ్చి పాలనిచ్చెలుటొక్కటి
నమ్మివచ్చినదానిని యమ్ముటొక్కటి
నమ్మినట్టి వానినిఁ జెడియమ్ము వాని
చెరుపుటాదియౌ పనులెల్ల నరకములగు.

అ. అనుకుశధ్వజునివంకకు తీక్ష్ణముగా జూచి పండ్లుపటపటంగొరుకుచు మరలఁ దలయూపుచు మరల నవ్వుచు.

శంకరాభరణము-ఆదితాళం

ప. ఇంతమాత్రమునకే నామది సంతసించునా మామా॥ యి (హరి)
అ. యంతవాడనేఁగానా యీదంతిగమనగొనిపోనానీ వంతునలహాయిదే నా యీ దంతిగమన మర్యాదగగోరిన యంతనన్ను చెవులుబట్టి యీపెడు నిం.

చ। నీ।గొంతుకిప్పుడు నులుమనా।ఆ। యంతకునికడకనుపనా।నీ। యంతవాడిటుబలుకన। నేగోరగ యింతవాఁడవని యఱుఁగగపోతిని।సంతసము ననీకూతుంగొనియెద॥ నిం॥
సీ. బలవంతముగనె నీపట్టినిఁ గొనిపోదు
నెప్పట్లనన్నది తప్పుకొనునో

మావంశమున కిది మాసికీర్తి ప్రాప్తము
మని వేరెచెప్పెడి పనియులేదు
మావంశమున కెల్ల మకుటమై చెలగెడు
దశకంఠుపుట్టి విత్తనివికొలది
గావించెనతనికి గన్పించనే లోటు
మాకచ్చుబాటైన మార్గమెయిది

గీ. యైన సంబంధముం జేయనైన యపుడు
హితవుగా నుండుటయె మంచిగతియనుచు
చెప్పుచున్నాను వినుమికం జెప్పం బోను
రక్కసుడ నగు టెరుగుదు పెక్కుకేల.

గీ. అనిన ఋషికి కూతునిచ్చయి నగనికరమును
దంభు నాడంబరమునకుం దల్లడమును
తనదు చేతగామికి చింత పెనగుటయును
ముప్పిరిగొనంగ నసురుతోం జెప్పెనిట్లు.

సీ. గౌతమసతితోడం గలియకుక్కుటమైన
మఘువుని పాటు లేమయ్యెనోరి
గురుసతితో రతిగూడిన చంద్రుండు
మచ్చనొందినది దుర్మార్గ కనవ
ఒంటిదా దమయంతిం దంటాలుపెట్టిన
గుంపుకిరాతుడు చంపంబడడె
శచినిగోరుటనామె శపియింపనహుషుడు
నజగరంబై నట్టులనంగ వినవ

గీ. యింతయేల త్రిమూర్తులు నేగుదెంచి
యత్రిఋషి సతియైనట్టి యామెం జెరుప

దలచి బాల్చురై యూయలఁ దల్ల డిలరె
చావు నభి పిండి మెుసైనఁ జరుగనిమ్ము.

మంజరులు-నాదనామక్రియ

1. అనియిటు లెన్నో విధములఁ జెప్పిన । నాకుశధ్వజునిమాట
వినక దౌర్జన్యముగ నాక్షణమున । సనిపె స్వర్గంపుబాట
2. అంతమీాద వేదవతిదగి కేగి । యంత మొందె నీతండ్రి
సంతోసంబున దేవతలెదురై । చాలమెచ్చుకొనుచుండ్రి.
3. తల్లిఁ గూడ తండ్రితోడచచ్చెను । తన్వీ యిట్టులవినుము
తల్లియైన లేని నీకేదారి । తగునన్నుఁ జేరిమనుము
వ. అట్లువచించిన రాక్షసుని మాటలు విని.
గీ. తల్లిదండ్రులిర్వురి చావు తక్షణంబె
జరిగె ననెడి విచారంపు సరణిగొనక
రక్కసునిచేతఁ జచ్చెడి వాత్రిగల్గి
నందులకుమాత్రి మానతి బొందెచింత.
గీ. అన్నిపనులను మానిన యాదిదేవు
డెల్లభక్తులఁ గాపాడు నెట్లు గలదో
సర్వము న్వదలినయట్టి చానయొక్క
హరినిఁ బెండ్లాడు తలపును మరువదయ్యె.
వ. ఆసతి పూర్వోక్తప్రకారము చింతించి.
గీ. నేను హరిసేవనంబున నిశ్చయముగ
నమ్మి యన్యులఁ గోరని నాతినేని
విధి విధించిన పనియైన బుధవిరోధి
చావు మాతాపితలఁ జంపినావు గాన.

వ. అని శపించె.

దిండి

1. పిడుగుబడ్డ తాడిచందమున । బడె నారక్కసుడు
చెడుపనికి ఫలమిదియని నాతి । నుడివెనప్పుడు.

2. తదుపరి భక్తి విష్ణునాకాంత ! మొదదలంచుచు
మదిఁ జెవరసీక తపంబవెంతో ముదమునఁ జేయుచు.

3. నుండగా రావణు డొక్కనా డా । యువిదను గాంచుచు
పండుంగన్న యభోజనునివలె ! పైఁబడఁజూచుచు

4. మంచిచెడ్డ యాలోచించకా । మానినిం బిలిచి
అంచయాన నను పెండ్లాడు నా । యందముం జూచి.

కం. యని నంత నోమహాత్మా
వినునే విష్ణువునుఁ దప్ప వేరొకవరునిఁ
గొననని నిశ్చలమతి నై
యనిమొదఁ గావునను నన్నుఁ గొన నెంచకుమా.

గీ. సోదరా యేల నీబుద్ధిజూడ నాకు
వింతనైొ దోచుచుండెను వింటి నేను
కోట్లకొలదిగ సతులు నీకుండిరనుచు
నాది మొదలంతమునకిది యాయవస్థ.

గీ. ఆదిలక్ష్మిలో సగభాగమయ్యా నేను
యీకుశధ్వజు వేదము నాకుఁ గూఁడ
యింపగుటఁ జేసి విష్ణును విడువలేక
నగమచటనుండి నగమిట జననమైతి.

సురట-ఏకతాళము

ప. తుజల నెప్పుడాపతిని గలతునని . మనమున చింత చే గుందుదునూ

అ. పరమపావను పూజలాచరించుచునుంటి। భావము నెప్పుడు చెడనీకను.

చ. వేదమునైకె పతిని కిడిచినపాపము పోదట యీజన్మమధ్యమునా

యేదారికలడంచు వెదకుచునుంటిని।పోదామె ప్రాణమదేదారినైనా
2. యెందరుసతులునీకైయెదురుచూచుచునున్న।అందరినీవిడిచియుండెదవు
నిందలకొడిగట్టి నీ తుల నెల్లను । నేదో నేదో వెదకితెచ్చెదవు.
గీ. ఆరయ వివాహ మొక్కటె నాడి కులము
నుందరింపంగఁ జేయంగ కంద నొకని
గనియుసతని వివాహము గనుల జూచి
యడవి కేగుట ధర్మమో యన్న వినుము.
గీ. గాక మీామతమున నదిలేకయున్న
నొకతె కిద్దరిఁ బెండ్లాడు టొప్పంబడును
పుత్రులిద్దరు ముగ్గురు బుట్టిరేని
యప్పుడైనను బెద్దగా నొప్పవలయు.
వ. మఱియు.
కం. నీ వెటుల పరసతులమది
భావింతువొ యటులె నీదుభార్యలుఁ గూడన్
గావించిరేని నీమది
కేవిధమునఁ గష్టమట్టులే వారలకున్.
వ- అదియునుంగాక నీవుయోగ్యుడవు సర్వమెఱుంగుదువు
గీ. పుణ్యమాపురుషార్థ మాపుడమినైన
కీర్తియాలాభమాయిది కీడుగాని
చెప్పినానని నాయందు తప్పుపడక
మానుమా రావణా చెడుమార్గమిద్ది.
వ- అని చిలుకకుంబోధించునట్లు బోధించునావేదవతింగని రావణుడు
కమాచి-జుల్వా
ప. నానసీవద్ద నెంత । జాణతనమున్నదే
అ. మానవంతులాలదైవ ।నాసిమిత్రమేలనే .చా।

చ. అంషజసమాన యానా । గుండెజల్లుమనియెనే
నిందు చందురుండునీ । యండనుండ నేలనే। యోచాన.

2. మందమారుతంబుచేనా । డొందమొంతోగుందెనే
ఎందరేనినీనఖంపు । టుందమైనఁబోలరే. చా.

3. ఎట్టులైనఁ గాని నిన్ను । బట్టియేగకుందునే
పట్టరానిమోహమునే । నెట్టులాపగల్గనే. చానసీ.

వ- అనపిని అయ్యో యెంతయవివేకివన్నా నిన్ను నీవుతెలుసుకొనకున్నావు

సీ. కుక్కుటధ్వనిలేచి ముక్కోటిలింగాల
బ్రొద్దుదూరకమున్నె పూజసేతు
శైలరాజంబైన కైలాసనగరినం
దెందరోగీర్తింప నెత్తినావు.
నరవానరులదప్ప నందరిచేతను
చావులేని తపస్సుసలిపినావు
దేవేంద్రుడాదియౌ దేవతలందరి
గట్రూళ్ళనీయింటఁగట్టినావు

గీ. పరులచేఁ గానిపనులెల్ల నెరపినావు
నిఖిలలోకాల నీకీర్తినిలిపినావు
అట్టినీకిట్టి దుర్బుద్ధిపుట్టనేల
పట్టరాని కీర్తింజెడగొట్టనేల.

వ-ఇంతకుమున్నే చెప్పితినే పుణ్యమా పురుషార్థమాయని నానిశ్చితాభిప్రాయము వినుము.

శంకరాభరణం చతురశ్రగతి

ప. క్షీరసాగరశయనునోరితిరానేని । కేరికైననుసతి గానేరనురా. క్షీ.

అ. నిరతమతనిసేవ నెఱపుమురా నీ।నిఖిల పాపములును బాయురా. క్షీ.
చ. అతిపవిత్రమతముబూనుమురా। మది।నతనిపాదముల దెనమ్మురా. క్షీ.
2. మోక్షమార్గంపుసీనులు బూనుమురా। నీ।ముక్తికి శ్రీహరియె
మూలమురా. క్షీ.

గీ. ఇట్లునిర్భయంబుగ బల్కునింతిదరికి
జేరి యంగమెల్లన్మతిమీరినట్టి
చెమ్మటల్గగుర్పాటులచేత వణక
యెట్టకే ధైర్యముంగల్గియిట్టులనియె.

ప. ఎట్టివగలాడివే। గుట్టుగలదానవె. నిన్.
అ. ముట్టుకొనువరకును। గట్టిబడ దేమది. యె.
చ. ముట్టెదనిన్బట్టెదను। నెట్టెదనుమాపురికి
కట్టామదనుండునను। గట్టెసిచెంతను. యె.
2. నాకంబెమురహరి। యాకాశగమనుడా
చేకొనినన్నునో। చెలిసుఖముంపును. యె.
3. పిల్లదాన వగుటచే। కల్లనిజమెఱుగక తగిన
వల్లభుడనే దొరుక। వల్లగాదనెదవె॥ యె.
4. హరినిన్నుగాచుట। తరుణినే జూచెద
పరమార్థమింతకన్న। మరియేమున్నదే. యె.
5. తన్వినీప్రాణకొన్న। నన్విడచు ప్రాణములు
మిన్వొరిగి మీదబడ్డ। నిన్విడువజాలనే॥ యె॥

మంజరులు భూపా॥

1 అనుచు కన్నుల న్వొరలుగ్రమ్మగా। నారావణుండు బలిమిన్
జనార్దనుండెటు గాచునో జూతు। ననిమూర్ఖత చెయిబట్టన్॥
2. ఏ కారణంబుచేతనో యచట। నే ముక్కినుంట బుట్టెన్
భీకరవహ్ని మంటలు చొప్పజూని। నాకపతి వైరి జడిసెన్॥

3. బలిమినన్నుఁబట్టినావు గావున । పాపాత్మానినుమిన్నులు (నీ)
కులమంతము నొందింపఁగ బుట్టెద । నిలలోన మృత్యువళ్లు.

4. అనుచునగ్ని బడి యంతమొందెనా । యతివ యాక్షణమునందు
పెనుభూతము యక్షిణియును జూచిన । వానివలె రక్కసుడుగుండు

గీ. ప్రీతిగలవస్తువే తనచేతికబ్బి
గరుడు డెత్తుకపోయిన కరణినుండె
తనమనంబున కెంతయో యనుగుణమగు
కాంతగన్పడి వేగమే యంతమాట.

గీ. అందుఁ గూడ నద్భుతగతి సుందరాంగి
పిలిచినంతనె వచ్చెడి పేర్మియొకటి
యగ్నికుండుట వెంటనే యలివబడుట
వహ్నియుగ్గాంతయు గ్గూడ వన్నె చెడుట.

గీ. అట్లుకొన్నాళ్ళు జరిగిన యాతమీద
లంకనొక సరోవరమునఁ బాకజముఖి
యైన యావేదవతి చక్కనైన కన్నె
యై యొకసరోజమునఁ బుట్టె నద్భుతగతి.

గీ. వింతగా సరోజంబున వెలసినట్టి
కాంతనందరు చిత్రంబు గతినిఁ జూచి
రావణుం డబ్బురం పడగా వచింప
గురునితోవచ్చి కాంచె నాకువలయాక్షి.

గీ. ప్రజ లనంతముగా జూడ బరగినారు
యేమియగునో యనుచుఁ గొంద రేగి నారు
యెన్నడెరుఁగని వింత లివేలనేదొ
కలదుముప్పంచుఁ జెప్పకోఁ గలిగినారు.

మంజరులు—ముఖారి

1. గురువులు శిష్యులు పిన్నలుపెద్దలు । గూర్చుండి రొక్కచోటన్
తరుణి యెవ్వరేమి సేయవచ్చెనో । తలచిరి జ్యోతిషపుబాటన్.
2. ఇట్లు చెప్పె నాశుక్రాచార్యుం । డీకన్నెవలన నీకు (ని)
క్కట్లు తప్పవిట నుంచితేని విను । కలుగనీకుము పరాకు.
3. కడుతొందరగా నీసముద్రమున । బడవేయించుము చానన్
అడియాసతోడ నుంచకుమీ యొక । గడియయైన ముప్పుగానక.
వ. అని శుక్రుడు చెప్పకర్ణకఠోరమైన వాక్యంబులు దశగ్రీవుడువిని.
గీ. దొరికినట్టిధనంబును దొరలువచ్చి
బలిమిమై లాగుకొన్నట్టి పాంథువోలె
చలముఁ బొందెను యానిశాచరవిభుండు
చక్కనైనచుక్కను విడజాలలేక.
గీ. ఎట్టకేలకు పెట్టెలో నింతినుంచి
భటులఁబలిచి సంద్రమ్ములో బారవైవ
నాజ్ఞయిచ్చెనంతనె భటుల్ నాతియున్న
పెట్టె గొంపోయి కడలిలో వేసినారు.

బిళహరి—త్రిపుట

ప. పెట్టె సంద్రములోన వేయగ । కొట్టుకొని యొక ద్వీపమందున
అ. గుట్టుగలస్త్రీబట్ట గప్పకొను। నట్టు మట్టిచేఁ గప్పబడియెను॥ పె॥
చ. జనకరాజేలుబడి భూమిలో। వెనుకఁబడె సంద్రమొక్క యోజనము
గనుకనాభూమిని సాగుజేసెడి । యనువునను దొరికె నీపెట్టె
మ. అనంతరము వారలు రాజున । కతియాశ్చర్యమునం దెచ్చిచూప
పనివారిని దెప్పించియు మిగుల నేర్పుగ దీయించిరి పెట్టెమూత. పె॥
2. అందులో దేదీప్యమానమౌ । సుందరీమణి గానుపించగ
సందియంబు ముదంబాశ్చర్యము । డెందమున నుప్పిరిగొనగా

మి. నందరికిం జూపుచు నంతస । మందుచు నాకన్నిం బెంచుచు
సుందరాంగి కెట్లైనఁ దగిన॥యందకాని గూర్చునంచు నాలోచించె.
వ. ఇట్లాలోచించి నాగటికొనకుం దగులుటచేత సీతనామముంచి యమి
తముద్దుగాఁ బిల్చుచుండు.
3. ఒక్కనాఁ డాకాంత చెలులతో॥పెక్కువిధములఁ గవ్వలాడుచు(నా)
చక్కనున్న శివుని విల్లుక్రింద । జిక్కువడగా నాగవ్వకొఱకై
మి. పెక్కుభంగులను తండ్రిడిగి । దక్కఁగ లేదా గవ్వయనుచు
ప్రక్కనావిల్లుం గెంటి । చిక్కియున్న గవ్వనుకైకొనె ప్రీతి ॥పె॥

—సీతాకళ్యాణము—

కం. అలనాటినుండి శంభుని
విలునెక్కిడు వానిజూచి వేగమెసీతా
లలితాంగిఁ బెండ్లిసేతును
ఇలజను లెల్లరును మెచ్చనింద్రుడు మెచ్చన్.
వ. అని నిరంకుశప్రతినఁ జేసె నో శ్రీరామచంద్రా.
కం. ఆవిల్లునీకుఁ గాకే
భూవరునకు సాధ్యపడదు పుణ్యచరిత్రా
నీవింక భూమిజాతను
వైవాహికమాడి కీర్తివంతుఁడ వగుమా.
కం. అనుటయు నారాఘవు డటు
వినుటయు నటనున్నవారు వింతఁ బడుటయున్
పనికొరకు ముగ్గురేగుట
జనదని పైలవునిఁ గూడ జత దోకొనుటల్.
గీ. మరుచటి దినము పయనముస్థిర పరుచుట
గౌతమ మహాఋషికి కుడికన్నదరుట

సూర్యనాడి కౌశికముని చూచుచుంట
సూర్యుఁడుదయించి నంతనె వీర్వెడలుట.

వ. జరిగినతదుపరి నున్నవారెప్పుడును ఉన్నవారినే గౌరవింతురను కించిజ్ఞులున్నను నెవని నెప్పట్లు పొందఁదగినయే యేవస్తువాయా సమయముల యందవశ్యము లభ్యపడక తీరదు గావున సర్వవిషయాగ్రగణ్యుఁడైన యావిశ్వామిత్ర మహర్షి యదృష్టవంతుఁడైన రామమూర్తికే సిరిం గూర్పఁ దనవెంట లక్ష్మణసైలవసహితునిగాఁ దోడ్కొని యేగునయ్యవసరమున చండభానుడును కలవారు కలవారికే గూర్చుట మంచిది ఊరకే కలవారుగాఁ బుట్టుదురా పుణ్యపూర్వులు గాక యని విశ్వామిత్రుండువోలెఁ దానును సమర్థుడుగాకున్నను తనసంతోషమిన్నాళ్ళకన్నఁ దేజముగా నుండుటయే యని వెల్లడిసేయ నెవరిసంతసము వారు వెల్లడి సేయకుందురా యీసూర్యభగవానుఁడే సమర్థుడాయను నట్లు కోవెలలు శ్రీరామచంద్ర ప్రయాణోత్కృష్టతను తమతమగాత్ర మాధుర్యంబులతో మంగళవాద్యములట్లు మధురగానము వెదజల్లుటయును. తత్కోకిలారావంబు కదిరియాసమీపమునం గల వృక్షశాఖనున్న నొకబల్లి ప్రయాణము సేయుచున్న శ్రీరామచంద్రుని దక్షిణభుజంబునం బడి యదృష్టవంతురాలు గావు నన్మళియొకమారు రామచంద్రు పూర్ణభాగ్యుండుటం జేసి మోచేతియందును రాఘువుం డేగు కార్య మవిఘ్నముగ జరుగునని సూచనం దెల్ప నామణికట్టునందు నుండి జారి క్రిందఁ బడుటయును మంగళాకరము లగు జంత్రములకే మర్దనరాపుడు లెక్కువనునటులా బల్లిం బట్ట దక్షిణదిశనుండి యుత్తరదిశకు రామునకు ముందుగా నేబ నెమలి గిన్నెకోడి భరద్వాజ ముంగిస మొదలుగాఁ గలదక్షిణదిశ గమనోత్కృష్టములును అయ్యోయిమన తావులకివి వచ్చి మనలభాధించు గదాయని కొంతతడవే తావులనైన నిలిచి మరల నివియేగిన యనంతరంబ మన తావులకు మనము

జేరవచ్చుననుకొని వీటికినెదురుగా పైవాటుగావచ్చు పిచ్చుకచిలుక తుమ్మెదగుము లుత్తరముగా ప్రయాణము జేయుట విశ్వామిత్రుడు చూచి భళిరే రాముని యదృష్టము కన్న నాయదృష్టమే వర్ణనీయము స్వలాభమునుం గోరిన విశ్వామిత్రుడు తోడ్కొని యేగిన బాలుర మఱల యథావిధిఁ బంపెనను నల్పవాదు రాకుండ శ్రీసీతామహాలక్ష్మితోఁ గూర్చి భార్యాసహితముగ బాలునిం బంపితి నేని సర్వలోకజనులు నన్ను మిన్నగ రాముని కీర్తియుండునంత కాలము మహావిష్ణువైన రాముతో పాటు రామోపకారియని యజ్ఞానసజ్ఞాన సమూహములు రెండునుఁ బొగడునుగదాయని మేఱలేని సంతసముం బొందుచున్నట్లర ణ్యాదైర్ఘ్యమంతకంతకుం బెచ్చుపెరిగి విసివినబడని చిలు కపలుకులును మీకన్న మంతయల్పముగ ప్రజలకు గన్పించినను మాయమృతపానసారమెచ్చటి కేగునని నిరాఘాటంబుగా వీనులకు వివిధశబ్దంబులుగ విన్పడం కేకలువేయు తుమ్మెదల ఝూంకారంబులును. ఎప్పుడును జంటబాయక నతిమైథునాసక్తి గలిగియే సస్యమ్మైనను సునాయాసముగ నొలిచికొని తిన గలిగి కీచుకీచుమని పూర్తిగ ననలేని పిచ్చుకలును. పిచ్చుకలంపట్టితిని తమతమ పొట్టల నించుకొనవలయునని భూమియువృక్షములు నఱుగఁ దిరుగు కట్లపిచ్చుకపొడ మొదలుగాఁ గలపాములును. పాముల నెగరదన్ను కొని వృక్షములపైకేగి తృప్తిదీరం దిని వెక్కసమై యసహ్యించి క్రిందఁ బడవైచు గ్రద్దలును ఆగ్రద్దలచేతలకు సంతసించి యలవిగాని వస్తువు సమకూడె గదాయని మిగిలిన మాంసముం దినవచ్చిబారులు గట్టి సాధ్యమైనంత వరకుదీసిన మాంసమునుఁ బోసీయ తమతమ తావులైన వల్మీకంబుల కతికష్టమున గొనిపోయి తినవచ్చనను చీమలును చీమలంజూచి మీరెన్నటికిని లోభులవలె నేవస్తువైనను జూచి చూచి తినఁజాలరు మిమ్మును మీయభిలషిత వస్తువులను మీకు సిగ్గువచ్చునట్లు మేమేమెట్లుతిందుమో చూడుడను యడవికోళ్ళును. అ

య్యడవికోళ్ళ చేష్టల చాటుచాటుననుండి దుర్మార్గుల దుర్నయంబులఁ
దమకుఁ గన్పడకుండ దైవప్రేరేపితంబులై కలరా స్ఫోటకము మొదలు
గాఁగల యమ్మవార్లవలె కనిపెట్టి తగినసమయమునుగ్రహించి చప్పుడు
గానీయక వచ్చితిను గండుపిల్లులును. పిల్లులయంతటి యుక్తి నెఱుంగక
యజ్ఞానులవలె నెచ్చటకంటఁబడిన నచ్చటినుండియే మొఱుగుచు నెప్ప
టికిఁగాని కృతార్థతఁ బొందజాలని శునకంబులును. శునకంబులయఱ
పులకే నీచమానవునిం జూచిబెదరు యోగ్యులచందంబున బెదరు లేళ్ళ
గుంపులును బెదరినలేళ్ళకై గనిపెట్టి యాఁకలిదీర్చుకొనసున్న పులులును
పులుల నిరసనముగాఁ జూడఁదగిన జంతువు లింకేవి మాకంటె నని
ఘీంకరించు నేనుంగులును ఏనుంగులంజంపు శక్తి మనకుగాక నెవరికిగ
లదని విఱ్ఱవీగుచు నదనైనప్పుడెల్ల చెంగున నెగిరితిరుగులేనిశతఘ్నివలెకు
భస్థలములంబ్రద్దలుజేసుకొని మెదడులందినుగజహంతకులైనసింగంబులును
మొండివాడురాజుకన్నఁబలవంతుఁడనుసామెతన్ సింగంబులైనను మనలనే
మిసేయగలవని బెదరుగల ప్రక్కచూపులులేక నేయడ్డునకైనన్నంక సేయని
యడవివరాహంబులును. మొదలుగాఁగల నయ్యడవిందాటి సహవాస
దోషేగుణా భవంతియను నటులను పుణ్యాత్ముఁడొక్కఁడు స్వర్గము
ననున్న యెడల వారియేడుతరముల వారినిఁ గూడ యముడు విడచున
ట్లును యోగ్యునితో వచ్చినకించిజ్ఞునకుఁ గూడ గౌరవము జరిగినట్లు
నుదుర్కుట జంతు సంతానమే యొకదాని నొకటి దినక కలియంబడక
పరస్పరానురాగంబుగనుండు గౌతమాశ్రమంబు సమీపింప వెలిసిన
వర్షము పడువున నెంతకటవున కంత సమృద్ధియనునట్లు నెంతకష్ట
మున కంత సుఖమనునట్లును. మొదటి యరణ్యరోదనముచే నదిరినచె
వులంత నిశ్శబ్దితంగాంచె. అనుచోదితంబులగు మృగములఁ జూచిన
యానేత్రాష్టకము లానందకరములగు జంతువులం గాంచె మార్గమెంత
చిక్కగాఁ దోచెనో యంత విస్పష్టముగాఁ దీర్చినట్లయ్యె నట్లన మొ

దటి యరణ్య ఘోషకుమారు వేదఘోషయును మొదటి మృగక్రౌ
ర్యంబునకు మారు మృగకరుణయును మొదటి కృత్రిమమార్గంబులకు
మారు ప్రచ్ఛన్నమార్గంబులును. మొదటి కూర్చొన తగని యెండు
మోడులకు మారు కూర్చొనఁదగిన చలువరచ్చరాళ్ళును. మొదటి
కంటకకుంజంబులకు మారు లతాకుంజంబులు మొదటి యడవిమనుష్యు
లకు మారు మహాపురుషులను జూచి యబ్బుర పడునా బాలత్రయము
నకు విశ్వామిత్రమహర్షి యిట్లు చెప్పదొడంగె. శ్రీరామచంద్ర లక్ష్మ
ణపైలవులారా ఈయాశ్రమము గౌతమునిది సమీపిత యాత్రికులమైన
మనకిదివరకు మార్గాయాసము తోఁచకున్నను మజిలీయగుటం జేసి వెళ్ళ
లేమా యను ధైర్యమున చరణ విశ్రాంతి నీయవచ్చునదిగాక పిలువని
పేరంటమువలెమన యంత మనమేగుటకన్న పుష్పజలదర్భలకై వచ్చు
గౌతమశిష్యులచే వర్తమాన మంపి సగౌరవముగానేగ వచ్చునించుక
విశ్రమించి యేగుదమిటఁ గూర్చుండు డనుటయు విశ్వామిత్రుని వాక్య
ములాలించిన వారట్లు నిశ్చయించి మొదట విశ్వామిత్రమహర్షినిఁ గూ
ర్చొననిచ్చి లాంఛనప్రకారము రఘురాముఁడా సమీపముననేగల మ
ఱియొక సిలపై గూర్చొననుంకించినంత శుభము గలుగు మనుష్యుని
దక్షిణపార్శ్వ మదరునట్లును బంధువులు రానున్నయింటియెదుట కాకం
బరచునట్లును పెండ్లికాలముచేరువయగు వానికి వైవాహిక కళయం
కురించునట్లును కాఁగల సీతాపతివాయు ప్రసారితమైన శాపిత, యహ
ల్యయగు సిలగదిలినట్లా యోగ్య చతుష్టయమున కగుపడినంతనే రా
ముండేల నీరాతికీచలనమని తనపాదముతోఁ గదుపకోరని కోరికగా
ధర్మదేవత ప్రత్యక్షమైనటులును ఏదియో స్వప్నమునుం గన్నట్లును
మీరుపోబోవు కార్యమవిఘ్నముగా నెరవేరునని యాశీర్వాదముం
జేయ వచ్చిన యంబవలెని గుమాదిన నిష్కాచందమున కాషాయాంబర
ధారిణియై సిరమువాల్చుకొని నిలువంబడిన యాపెంజూచి నిశ్చేష్టులై

విశ్వామిత్రుఁడంకఁజూచు నారామాదులంగని శ్రీమునితో రామాయీయామె గౌతమమహాఋషిపత్నినామమహల్య యందురు అనునంత. సాటిముని పత్నియగుటచే నచ్చటినుండియే రామునకు విశ్వామిత్ర సహిత రామ చంద్రా చిన్నవాఁడవైనను మహాపురుషుఁడవును ధర్మదేవతవును రాక్ష సాంతక జన్ముండవును విధి ప్రతిపన్నుండగు కుశికనందనుని శిష్యుండ వును యజ్ఞపాయసాహార కారణోద్భవుండవును మహాపతివ్రతా తిలక మగు కౌసల్యాగర్భశుక్తి ముక్తాఫలుండవును శతకరీబల తాటకాంత కుండవునుమదీయ భర్తృసంధాయకుండవును కాఁగల సీతాపతివి. యగు నీకు నమస్కరించుచున్నాను అని యామె భర్తృపాదసేవ నాతత్పరురాలై యేగుటయును ఆమెచరిత్రమంతయు నామూలాగ్రముగానా శ్రీరామ చిత్తశతంబులతో బూర్తిజేసె నీయహల్యా పునర్దర్శనాభిలాషియైన గౌతమ మహర్షి గతమును తెలిసి ఫలము పొందునప్పటి తపసివలె నమి తోత్సాహంబున శ్రీరామ విశ్వామిత్ర సందర్శనాభిలాషియై వచ్చి గౌరవముగా నీయోగ్య చతష్టయమును దోడ్కొని యూరే యితనకుఁ గల్గినదే యెంచి నలవిగాని సంతసమున నాతిథ్యమిచ్చిన నారేయి యటఁ గడిపి స్వప్నసావకాశా దూరులై సుఖంబుగ నిదురగాంచి మేల్గాంచు వరకు—

సీ॥ చల్లఁగా వీచెడి పిల్లతెమ్మెరలచే
మూడుజాములకాల ముత్కటిగాఁగ
కుశికపుత్రుని లేపకుంటిమి జాగయ్యె
నని భయంబునఁ జెట్టులల్లలాడ
వివిధనాదములతో రవిమేలుకొల్పఁగ
కువలాయికంబులుఁ గూతగూయఁ
పెంచనిమృగములే పేర్మిమునులలేప
వచ్చినయట్టులఁ దచ్చియాడ

గీ॥ మునికుమారులంతకు ఘున్న కనులు తెరువ
ప్రకృతి కలకలమని వింతపాటఁ బాడె
వేగ లెండని యువకుల జాగులేగ
బల్లుమని యాశ్రమంబునఁ దెల్లవారె.

గీ॥ కార్యభారమునందున్న యార్యవరులు
తడయరెవ్వోటనైననుఁ దక్షిణంబ
హస్తగిరిఁ జేరనతిగెడునబ్జహితుడు
వింధ్యపర్వతమున కేగి వేచియున్న.

వ-ఎప్పటియెట్లనా యోగ్యత్రయముతో గౌతమునివద్ద శలవుదీసుకొని విశ్వామిత్రమహర్షి.

తోహరలు-మలయమారుతము

1. ఆమడలడుగులు గానడచుచునా । యాజసుతుసుతులతో మీరి
హేమమాక్తి కాలంకృత నిధియా నామినిలదరికి జేరి॥

2. నాల్గవభూతమునకు వన్నెవెట్టు । నట్టిశమనునిం జూచి
వాల్గంటియాభూసుత చరించు। వనమదియను మువచించి (బాలురతో

3. ఇందుననీ రేయి గడిపితిమేని । యేగువెంచి జనకుంచు
సందడిగాఁదోకొని యేగినచో । సగౌరవముగానుండు॥

వ-అని యారేయినఁటగడుప నాలోచించుకొనిరి॥

గీ॥ సూర్యుడ పరాంబుధిం జేరె చుక్కలదొర
యేలెదనురవిపోల్కినే నిలసటంచు
నేలతిరుగరు ప్రజలంచు జేలపోవ
వృక్షముల్దలత్రిప్పుచు నిచ్చ దెలిపె.

వ-ఒకనాడు

(దిండ్లు)

1. చనువొప్ప నారదుడా । జనకునింటికి

మనమరల జనుదెంచుచుండ ! జనకుండెదుటికి॥ (నేగి)

2. మహనీయ నేడునాజన్మ । మయ్యె సార్థకము॥ నీరాకచె॥
నిహపరములకు త్రోవ । యిటుదయనేయుము॥

వ-అనిమనోవాక్కాయకర్మముల నామునింబూజించి! నారదమహానీంద్రా
విల్లెక్కువెట్టిన వానికి దక్క నొరులకు జానకినీయనన్న ప్రతిన
వింటివిగదా

జంజూటి- జుల్వా

ప॥ మనవివిను మునివరజనక జనకజను । గొనుపతిజగమునను
గానరాడేమిసేతును శ్రీద్ధత్తో॥ మ॥

2. ఎందుకీప్రతినఁ బూనితినో । సందియము గలుగుచున్నది.
యిందుధరుదయమెటున్నదో।ముందుగతిఁ దెల్పఁగదయ్యా॥ మహాత్మ॥ మ

3॥ మీావలనఁ దేలవలె సావధానచిత్తముతో । తోవగనుపరచిమముఁ!
బ్రోవఁగదయ్యా దేవ॥ మ॥

వ-అనుజనకునిం జూచి చిరునవ్వు నవ్వుచు నారదుడు జనకమహారాజా।

బెహాగ్-చతురశ్రగతి

ప॥ జానకికిమగడు।గానరాడనుచునీ । మానసమునదలచెదవా॥ రాజా॥

4. హరిమెనీతాపతి।జరుగుఁ బెండ్లియతి।త్వరితమైనగతి॥ యిటువినుమా॥

3. వడిలోఁ గలిగిన। బుడుతనిఁ జూడఁక । తడబడువానిగతి నడలెదవా
కడువడినిజసుతు।బుడుతనిఁగనుగొని। జడదారితోఁగూడతోడితెమ్మా॥జా

2. నీప్రమపావన।మేప్రశస్తముని । చూపడనీరేయి।కాపురముండిరట
యేపుదొలంగిపరి తాపముఁబొందక । నీపరివారమునంపింపుమా॥రాజా

వ-అనుపల్కులం గన్ణానందంబుగా జనకుండువిని యానందింపుచుండఁ
దాసదాసీజనంబుల వలననీ నారదుని పల్కులన్నియుఁ జానకివిని
యొకచెలికత్తియతో చెలీ!

మోహన-చతురశ్రగతి

ప॥ నోముఫలించినదా చెలియా నా । జన్మతరించినదాయీనాటికి॥ నో॥

2. మహామహుని పాదపూజఁ జేసెడి। మహిమనాకుఁగలదా। కమలముఖి॥

3. వీనులకున్విందు గలుగు పలుకుల । వింటిమిప్పటికిగావె చెలియా॥విం॥
గానకళానిపుణుండగు నారద । మౌనిరాకవలనా। నాపుణ్యపు॥ నో॥

4. బాలకళానిధియా శ్రీరాముని । భజనసేయంగలనా॥ యీజన్మలో॥
బాయకుండఁగలనా ఆవ్యక్తిని
పూలతోడఁ గౌసల్యకుమారుని పూజసేయంగలనా।తప్పకను॥ నో॥

వ-అని తనకుమున్న నానారాజన్య చరిత్రలుశతానందుడు చెప్పినప్పుడీ రాముని వివాహమాడవలయునని యుంచునట్లును దాసితోఁజెప్పియుల్లసిల్లుచుండ।

కం॥ మునిదెల్పు పలుకులను విని
జనకమహారాజు మిగులసంతసపడుచున్
ఇనవంశజలధి చంద్రుని
గొనిరాగాఁ జనియె వాద్య కూటమితోడన్॥

సీ॥ విడిదిలోఁగల పెండ్లికొడుకునుఁ గొనిరాఁగ
నెదురుసన్నాహము లేగినట్లు
దేశపుంగురు లరుదెంచుజాడను ప్రజల్
సంబరంబునఁజూడ సాగినట్లు
దేశముల్పాలించుకోశాధిపతిరాఁగఁ
జూడగఁ బ్రజలెల్లఁ గూడినట్లు
వెల్లటేనుగువచ్చి వేచెవేరండన
నద్భుతంబుగఁ బ్రజలరిగినట్లు

గీ॥ తమకుమించిన యువ్యోగి తరలివచ్చు
నదనునను చిన్న జీకగాంచ్రశనిఁదేఁగ

మేళతాళములతో జనులీలరాముఁ
దోడుకొనిరాఁగ జనిరి యాతోటకడకు.

వ-ఇట్లుపరివారముతో

తోహరలు

1. వచ్చినవారిని జూచి త్వరితగతి । బహుసంతసమునవారు
వచ్చుటకు సిద్ధపడియున్నారము । పదుండయ్యమీరాయారు
2. అనుచురామలక్ష్మణ కుశికపుత్రు । లందఃకొంత కెయిటనుంట
వినయసంభ్రమములఁతోడఁ జనిరా । విజయవాద్యములవెంట॥

సీ॥ విల్లునెక్కిడిన పైవిడిదికీనలసిన
సౌధములఁ బసనల్పనిడుట
పెండ్లికొమరునకు ప్రేమతోనిడునట్టి
ఫలహారములునర్పింపబడుట
వియ్యమందినవారి నెయ్యమట్టులనతి
ప్రేమతోనొండొరులెైనను గొనుట
వివిధమర్యాదల వింతవిద్యలనల్ప
పండితపామరుల్ పజ్జనుంట

గీ॥ యాదియైన గౌరవముల నాదినమున
పొందుచుండిన శ్రీరామచందురుండు
పెండ్లికళతోడ భాసిలియుండి ప్రజల
నపరిమితమైన యానందమందజేసె.

గీ. పూవుపూసినయంత నే తావిగ్రమ్ము
నన్నసామెత రాముని గన్నయంత
యెక్కిడును రాముఁడే విలునిక్కువముగ
ననిరి ప్రజలు పూర్వోక్తము ననుసరించి.

గీ. ప్రజలు రాముఁ జూచుచు నెట్లు బల్కుకొనిరో
రాముఁడా విభవంబుల రాకఁ జూచి
కౌశికుని దయవలన నాకౌ శుభంబు
లంచుఁ బొంగెను వివిధములగు తలపుల.

1. వింతయుపకారమునుఁ దలపెట్టిన। విశ్వామిత్రుం జూచి మహాత్మా
ఎంతతలపుమీలో నున్నది నే! నెపుడు మీ మోముజూచి.

2. గ్రహియింపలేకపోతి మహాత్మా గంభీరమైనను
సహవాసముఁ జేయువారికి గాక ॥ జనులకింకేమి తెలుసు.

3. సుతానురాగంబునఁ జూచినారు।సుమా యనుచు వినుతింప॥యితర
శతానందు డాఋషి చరితముఁ బహు।హితవుగనిటు వినిపింప

వ. మొదలిడి.

కమాచి-చతురశ్ర

ప. కోసలసుతనందన యిటువినుమా।కుశికసుతుని మహిమా॥నే దెలిపెద

అ. వాసుకికైననుఁ బొగడఁ దరమెయ్యా।భగవంతునిమహిమా॥నిక్కమిది

చ. ఎన్నోఘనకార్యంబులఁజేసె నీ।సన్నుతగుణశాలి శ్రీరామాయీన ॥
మున్ను మహోత్కృష్టముగా రాజ్య॥భోగమనుభవించినవాఁడీఋషి

వ. రామా మరియువినుము

సీ. రాజ్యపాలన ప్రజారంజకంబుగ జేయు
చుంజనె నొకనాఁడు బంజరులకు
వేటాడి మృగముల వేజంపి డస్సివ
సిష్టాశ్రవమ సకుఁ జేరి యచట
వ్యవధిలేకుండగా నాతిథ్యమందిను
రభిమహాత్మ్యమటంచు నభిలషించి
దాస్యఁగోరి వసిష్ఠుడీనేరననన్గి
కొనిపరాభవమిట్లు గోవువలన

గీ॥ గలిగినట్టి సంతానంబు ఫలనఁ బొంది
పట్టుదల వారి నవమాన పరుపఁ దలచి
తపమునం జేసె శస్త్రములు పరిగఁ గొని
వచ్చి మఱల గోసుతులను వధయొనర్చి.

వ-అట్లు వధయొనర్చి యూరకొనక గోవుపైకింగూడ బాణంబులేయుచుండ

గీ॥ అంతనా గోవు కించను నంబ యనుచు
తనదు సంతతిఁ గుఱిచివే తల్లడిల్ల
సూర్యవంశపుఁ గురుడిక నోర్వలేక
బ్రహ్మదండంబుతో నాపె బాణములను.

వ-అంత

శంకరాభరణము చతురశ్రగతి

ప॥ జానకీ మనోహర భక్తావన । జగదానందకరా। రఘురామా। జా॥
అ॥ శ్రీనివాస సర్వసుగుణపుంజమ । చెప్పెద వినుక డపటి సందర్భము। జా॥
మి॥ నేనింతటి యుద్ధప్రవీణుడనే । యీ ముని బ్రహ్మదండంబుతో
పూని జయింపగ లేకుంటిసిగద । భూరితరమె బ్రహ్మతేజమనుకొనె॥
చ॥ పరభీకర క్షాత్రతేజము కంటె । బ్రహ్మతేజమే బలమైయుండెను
కరుణాకరు భజనజేసి నేను । గడువేగమె బ్రహ్మఋషునిఁ గావలెనని
మి॥ త్వరదక్షిణతీరంబునకుంజని । పరమతపంబాచరించుచుండఁగ
కరకిరణుని వంశోద్భవుండైన । హరిశ్చంద్రుఁ జనకుఁడ చటికరిగెను॥ జా॥

వ-అట్లరిగి మహాత్మా రక్షింపుమని పాదములపైబడి మొఱవెట్ట కన్నులం బెరచి చూచి యెక్కడనో యవమానము పొందివచ్చినట్లు కనుబడిన యా త్రిశంకుం గ్రహించి॥

గీ॥ ఏలనయ్యా నీకిట్టులఁ బేలవోవ
తడవు సేయక జెప్పుము తపణాంబ
శరణనిన నిన్ను విడుతునే శక్తికొలది
జూచి శక్తి వంచన లేకఁ గాచువాఁడ.

వ-అనుకౌశికునకో యువరాజా త్రిశంకుండిట్లు బదులు సెప్పె

సీ॥ నేశరీరంబుతోనే స్వర్గమరుగగా
నభిలషించి గురువునడిగినాను
మంచిగాదని చెప్పమాని సాగదనక
గెలిసేయగ నేను వేలపోయి
నన్నుమేలం బాడనగునె యీముని యని
యవమానమున వాసియజశతమును
బాధింపవారలు బహుకోపముననున్న
నంత్యజుండగుదువో యవనిపాల

గీ॥ యనగనీమాల రూపము నందియేను
మీదయనుగోరి వచ్చితిమేదనీశ
హాని యిహపర హాధన మర్మరహిత
మీదయకుపాత్రుడను పెక్కుగాధలేల.

వ-అని వినయపూర్వకముగా మనవిచేసికొన నాత్రిశంకు గురించి యో చించి వీనిమనోరథము నెరవేర్పవలయునని.

(దిండులు)

1. తన్మనోరథ సిద్ధికై । తలపెట్టెనొక్క-
పెన్మచ్చబోయెడి వ్రతము । వేరాజు మొక్క॥
2. క్రతువున కెల్లవిప్రవరులు । కడువేగరాగ
సుతశతవాసిష్టుం బసూయకతమున రానాగ (కౌశికుడు)
3. శ్వానభక్షకులుగా వారి ! శపియించెనంత (నభి)
మానముగ క్రతువుత్వరగ । గానిచ్చెకొంత

వ-తదుపరి క్రతుభుగ్వర్గముస్వర్గముచుండిరానందున తనతపఃప్రభావము చేత మాలగానున్న నాత్రిశంకుని పొమ్ము స్వర్గమునకని చెప్పం బరువుంన్నియు న్నరిపడిన గాలి పటమువలెం ద్రిశంకుడు నాకమునకుం

జన నంత్యజుడు త్రిశివమునకు రారాదవిబిషొజుడు క్రిందికిం ద్రోయ నా త్రిశంకుడు మహాత్మా విశ్వామిత్రా రక్షింపుము రక్షింపుము నన్ను నా ర్తధ్వనివిన నాగుమచ్చట నాతపంబు ధారవోసితినని కేకవేయ నా త్రిశంకుడు స్వర్గమర్త్య లోకములకు మధ్యగా నాగ తనప్రభావంబుచే మఱియొక త్రిదశాలయము సృష్టించి యింద్రాదులం జేయ నుంకించిన త్రిమూర్తులరుదెంచి మహాత్మా మీరు దేవతలనే గాదు త్రిమూర్త్యాత్మకమైన పరమేశ్వరుంగూడ జేయగలరు మీరుస్వర్గముం దేవతలనుజేసిన లోకములు పాడుగావె యింక నీయుద్యమము మానుమన వారిమాటల నంగీకరించి లోకమున నెవ్వరుం గోరని కోర్కెలం గోరువారల కిది యే యవస్థయను నుపమానంబు కొరకా త్రిశంకున్వదలి పశ్చిమదిశం దపంబాచరింపుచుండ శరణవేడిన నరపశువగు రుచిక మధ్యమ పుత్రుశున శ్శేఫుని బాధింపనెంచి హావిష్యందాది సుతుల వసిష్ఠసుతులరీతి శ్వాన భక్షకులుగా శపించితనతపంబంతయుం ధారవోసి యజ్ఞముం దలపెట్టిన యంబరీషుని సఫలమనోరథుం జేసి శునశ్శేఫు ప్రాణముల రక్షించి యింద్రోపేంద్రుల గాథాద్వయిప్రీతులం జేసి తదుపరి మేనకవలంబడి శకుంతలం గని తనసంగతి కొన్నాళ్ళకు జ్ఞప్తికిందెచ్చుకొని చిరకాలంబు నుండి తపంబు సెడినదని పశ్చాత్తప్తుండై యట నామేనకాశాకుంతల లవిడిచి హిమవత్పర్వతమునఁ గౌసికీతీరమునఁ ఘోరతపం బాచరించి తత్తపోవిఘ్నతకై దేవేంద్రప్రేరితయై వచ్చిన రంభనను భవశాలియగు టంజేసి శిలగా శపించి! పూర్వదశనుచ్ఛ్వాస నిశ్వాసలు మాని మిక్కుటంబగు తపం బాచరించుచుండ తత్తపోవిశేషంబునకు మెచ్చియు కంపమొందియు సురలతో సహితముగా సురజ్యేష్ఠుఁడరుదెంచి మహాత్మా నీవు జితేంద్రియుడ వగుటం జేసి బ్రహ్మర్షివైతివి లెమ్ము సర్వవైభవములనుభవించి కొలదికాలంబుననే బ్రహ్మర్షివైతివి గాన వశిష్ఠునికన్న నీవేఘనుఁడవు వసిష్ఠుఁడుఁ గూడ నిన్ను బ్రహ్మర్షియను నన. సంత

సించి గాని మనశ్శాంతి పొందని యీకొరకుం డెట్టిపనినైనఁ జేయుటకు సమర్థుఁడై యుండ నీభార్యగా నున్న సీతను నీభార్యగానే సేయుట యీ మహాత్ముని కౌశికముని శతానందుఁడు రాఘవునకుఁ జెప్పుచున్న సమయమున విల్లెక్కిడుటకై వందిమాగధులు త్వరపడుచు నాసభామధ్యంబున కరిగి రామాదులు.

తోహరలు:

1. ఆసనముల నాసీనులైరిరా । మాందులు సంతోషమున
మోసపడిన రాజులెల్లఁ జూడఁగ । మొనసినిం డోలగమున

2. క్షాత్రవీరవరులారా మీరీ ॥ జనకు దీక్షను వినుడు
సూత్రమెఱిఁగి శివునివిల్లు నెక్కిడి । సుగుణవతి సీతగొనుఁడు.

3. ఎక్కిడఁ గల్గినధైర్యమున్ననే । విల్లుకడకు వేరందు
చిక్కదు విల్లను నధైర్యముండిన । జేరవిడుదలకుఁ బొందు.

వ. అని పలుకు వందిమాగధులం జూచి విశ్వామిత్రుఁడు నవ్వుచు మిగిలిన భూపాలురు సిగ్గునొంద రామా! నీకుఁ దక్క నెవ్వారికిని సాధ్యపడ దావిల్లు నెక్కుపెట్టుమన నాడంబరము లేనివాఁడగుటచే నావిల్లునకు ప్రదక్షిణమొనరించి విశ్వామిత్రునకు నమస్కరించి నిర్మలచిత్తంబున శివు నెవ్వారికిం దెలియకయే వేదాంతి పరమాత్మునట్టులఁ దలంచి.

కళ్యాణి-చతురశ్ర

ప. కోదండమెత్తె రామచంద్రుఁడు కోవిదులెల్లరుఁ భళిభళియనంగ
అ. వేదండయానను బెండ్లియాడు। వేడుకతోడ వేవేగముక్కంటి॥ కో॥
మి. సాధువుచే నాజ్ఞబొందుటొక్కటి। సహజధైర్యగాంభీర్యంబొక్కటి
నాధుడుగావలె నితడనిసీతా నాతితలంపొకటి యుప్పరిగొనఁగా॥ కో॥
చ॥ నాదుప్రతిన నెరవేరెననిమునిపొంగ। నాధుడెంతోయుబ్బర-బడు మండగ

యోధుఁడితఁడు తొలిజన్మమునం గని । యోగులు మిత్రముగా వచియించు
కొనఁగ।

మి॥ యీధరిత్రినిక నితనికి సరియగు । నవవంశజుఁ డొక్కఁడు లేఁడనుచును
బోధపడఁగ రూపలావణ్యములు । పొంగారఁ జవిఁ జెయని స్త్రీలనఁగా॥ కో॥

వ-తదనంతరంబా జనకుఁడా రామునకు సీతనిచ్చి వివాహముఁ జేయున
ప్పుడె తనతమ్ముల కూఁతులంగూడ రామునితమ్ముల కీవచ్చునని యెంచి
సగౌరవముగా దశరథునకు నాలుగు శుభపత్రికలనొక్క ముహూర్తముననే
నిశ్చయించి పంప నాదశరథచక్రవర్తి శుభలేఖలు మంచినెంచి గురుసహిత
ముగా సర్వవైవాహిక సంభారములను సిద్ధము చేసికొని సపరివార సహిత
ముగాఁ బయలుదేరి వచ్చి మిథిలానగర ప్రాంతమున విడిసిన నెదురుసన్నా
హముతో నష్టదిగ్గజములదరునట్లు సన్నాయి బాకారండోలు వీర
ణంతాసాడంకా నౌబత్ మొదలగు వివిధ మంగళతూర్యారావంబులతో
నేగి తోడ్కొని వచ్చినయంత

గీ॥ గౌతమ వసిష్ఠ నారద కౌశికులును
బ్రహ్మలగుచు వచ్చినయట్టి బ్రాహ్మణులును
బిళ్ళగోచులు సవరించి పెట్టుకొంచు
పీనపైఁ గావలసినవి పేర్చుచుండ్రి.

వ-తరువాత

సీ॥ పుణ్యాంగనలు కొందరన్యాయ గతమైన
నలుగునూతనముగా నలిచినారు
బాలురకంతతోఁ బరమప్రేమంగొంద
దలరిజవ్వాదిని నంటినారు
కమనీయదేహముల్ కనుచుంచు నుకొంచు
పన్నీటస్నానమున్ బ్రంపినారు

చలువవస్త్రములతో శరీరములు సద్ది
స్నానపాగదలల్ సరిగనార్చి
గీ॥ నాలుగునల్వురు బలురనల్వురికిని
తీర్చిరానన గస్తూరి తిలకములను
బుగ్గలకు దృష్టిచుక్కలం బొడిచినారు
ప్రేమతో దాండవంబాడ బెండ్లికళలు.
వ-తరువాత నాబాలచతుష్టయము
సీ॥ బిళ్ళగోచులుబోసి పీతాంబరంబుల
గట్టిరిపుష్టిం గట్టనెంచి
తారహారంబులం దాల్చిరి కనువారి
కన్నులకువిందు గలుగునట్లు
వినయసంభ్రములం బెనగిరి బుగులెల్ల
కొనియాడునట్టులా కొమరవరులు
బంగారుజాల్తారు పట్టువాణీలను
నొల్లెవాటులువేసి హాయులుమీర
గీ॥ పాదరక్షణకై పైడిపావుకోళ్ళ
దొడిగి నడచిరా బాలురనపరక చు
జనుల జన్మము సార్థకజనకమంచు
సంతసించువాడుంగాద సార్థకుండె.
గీ॥ చెప్పకొనుచుండ వినువారు చెప్పవారు
చూచువారు ధన్యులంటంచు చూచుచుండ
వారియర్ధాంగ లక్ష్ములై పరగునట్టి
వారలెంతధన్యులంటంచు బలుకవచ్చు.
గీ॥ అట్టులర్ధాంగ లక్ష్ములై యలరనున్న
జనకు నల్వురు కూతులున్నతి ముందె

గౌరిపూజలుగావించి కరముఁబ్రీతి
నెపుడుపిల్తురి బ్రాహ్మణులంచు వేచియుండ్రి

కం॥ రాజులకు రాష్ట్రపాలన
ధీజనులకు న్యాయచింత ద్విజులకుఁ బూజల్
తేజముఁ తాపసివరులకు
రాజీవాక్షులకు మగలు రాగముగాదే.

వ- పెండ్లిపన్నీట జలకంబులాడి యత్యుత్సాహముతో నున్న కొమరె తెలన్ జనకుండుపిలువనంప చెలికత్తియలతోసిగ్గుతో నుత్సాహముతో నంతకుమున్న పెండ్లిపీటపైఁ గూర్చుండియున్న పెండ్లికుమారులను తలి దండ్రులుం జూచునప్పుడు బాల్యచాపల్య దృష్టులతోఁ చెరలలోనుండి పరికించి సిగ్గునఁ దలలువంచి పెండ్లిపీటలపై నలంకరింప సరియైన లగ్న మున శ్రీరామచంద్రుడు సీతను భరతుడు మాండవిని, లక్ష్మణుడూ ర్మిళనుఁ శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని మంగళసూత్రాలం కృతులంజేయ నవ్వివాహసమయ మెట్లున్న దన॥

కళ్యాణి-చతురశ్రగతి.

ప॥ దాశరథులమైథిలులకళ్యాణపుఁ। దశదెల్పెద వినుడీఁ జనులార॥
అ॥ భూసుర ప్రవరులెల్లజనంబులు। ముత్యంబులవైవసిరముల్వంచిన॥దా
మి॥ ఆసలూరదంపతు లొండొరులకు। యాశతోవ్వ మత్వములంకురింప
భాసురగాత్రుల కొక్కరికొక్కరు।బంగారుకుతావి గల్గినట్లుండు॥దా॥
చ॥ వరుసనొకరి వెనుక నొకరుచేతులఁ। బట్టుకొనుచుసమముగ మిధు
నంబులు నరవర్యులకుఁ దాపసివరులకు।నతులొనర్చిదీవనలంబడసిరి
మి॥ అరరేదాంపత్యము లింతచక్కని।వరయలేదనుచు జనులు పొగడగా
సరసుడువిధియుని మెల్లివారలును।సమకూర్చినదంపతులగనియనగ॥దా

కం. వినుకలికను కలిగలిగిన
మన ఋసదే జన్మగాని మావరుచేష్టల్

వినకర్ణ విని నిందించిన
జనునిన్ వ్యర్థుండటంచు జనులందు)గదా.

బారువ-రూపకం

ప॥ రాజీవనయన సీతనిత్తునను। రాగమునఁగొనుమా। ప్రీతితో॥రా।
అ॥ ధీజనులుమెచ్చునట్లేలుమా । ధీరోదారశత్రుభయంకర॥ రా॥
చ॥ పెంచితినీ గవాలకుండగ । ప్రీతితోవయోనిజను రాఘవా
కించఁగలుగ నీకుజానకిమదికి । కిల్బిషమెరుంగని బాలామణిసుమా॥
2॥ అడుగుదాటదాజ్ఞమీరి। యన్నృతమన్మాట యెరుఁగదు
కడుభక్తియొరుల యెడలన్ । కనికరమొల్లి పేదలంగన
మ॥ తడబడుఁబిగ్గర బిల్చిన । తనవలె పేరవారిఁజూచు
బుదుతనెటులఁ జూతువోమా । పున్నెంబుల పంటయా॥రా॥

వ. అని జానకిం జేరఁదీసియమ్మా!

సీ। ప్రాణేశు తేజంబు పానంబు సేయుము
పాపోకంబుల బాటనుండి
సుగుణముల్మరికొన్ని శోధించుటెరుగుము
ముప్పూరత్తలకును బూజజేసి
మేలుమేల్లనకుని బాలయంచనఁ బ్రజల్
జనసర్వహితవుగఁ బెనగుమమ్మ
మఱదులన్ బిడ్డలతెఱగునఁ జూచుచు
వారినమస్కృతుల్ బడయుమమ్మ
గీ॥ మామయొద్ద నావద్దట్లుమసలుమమ్మ
పేదసాదలఁగను మమ్మప్రీతితోఁడ
పవల్లునిదురించకమ్మ వేపలుకకమ్మ
పతినిదైవంబుగాఁ జూడఁ బరగునమ్మ

వ॥ అమ్మా పతియొద్దనుండవలసిన ధర్మములఁ జెప్పెదవినుము.

సీ॥ సేవజేయుటను దాసీవలెనుండుము
కార్యములనమంత్రి కరణినుండు
రూపంబునందు లక్ష్మీపతిసతివలె
నోపికన్ భూమితోఁ దూపఁబడుము
తల్లివలెన్ జూడఁదగు నన్న మిడువేళ
శయనించువేళ వేశ్యావిధంబు
గాను మెలంగుము పూనమ మంచిని
నేమియో చెప్పితంచెంచకమ్మ

గీ॥ ధర్మపత్నికి ముఖ్యమౌ మర్మములివి
లోకులను చెడ్డంగ చెవిసోక నీకు
నిన్ను జేరియుండెడివారి నీతియుతుల
జేయుచుఁ సుగుణములను జేర్చుకొనుము.

గీ॥ పిన్ననాటనుండియు నిన్నుఁ బెంచితమ్మ
దాశరథికట్టె నిప్పుడే తాలినమ్మ
తొలుతయధికారమిక మాకు నిలిచెనమ్మ
తొలిచెవులుకన్నఁ గొమ్ములేములు కులమ్మ

వ॥ అనినలువురు కుమార్తెలను నలువురల్లులకు న్వప్పగింపుచు నాతలిదండులు కన్నీళ్ళుఁగార్చుచుండ వారివిచారము నోర్వగొట్టనచ్చటి కొందరు రాజులు విశ్వామిత్ర హర్షింజూచి మహాత్మా!

శహాన-చతురశ్రగతి

ప॥ ధన్యమయ్యె నీవంశ । ద్వయము భానిచంద్ర

అ॥ జన్యకుశిక నీదయచే । జనకదశరథులు వియ్యమంద ॥ధ॥

చ. చిరకాలము నీకీర్తిం జెప్పుకొంద్రు జనులు
ఖరపరిశేశు లుస్సుర గాలుము దేవతలు గూడ॥ధ॥

2. ఆదిలక్ష్మీనారాయణు । లట్లు సీతారాములు నుండ
నీదినమున మాకన్నుల । కింపయె జేజేలు ॥సీకు ॥ధ॥

వ. అని తనయభిప్రాయలం వెలుపు నన్యరాజు ॥ యుద్దేశములకు తాము వినయముగా చేతులు జోడించి దశరథుడు సంతోషరస మును జనకుఁడు విచారరసమును మార్చి వినయభావంబులం జూప కౌశికు డానందించి రామునకు వివాహ మొనర్పుట నావివాహాము కంటెం బదిరెట్లు సంతసముగా నున్నదని బాలదంపతులైన సీతా రామ మాండవీభరత ఊర్మిళాలక్ష్మణ శ్రుతకీర్తిశత్రుఘ్నులం బతు పాకములేకుండ నాశీర్వచించి జనకరాజా పయనంబుల న్మాత్రము త్వరం జేయింపుము కించి దుపకారముం గోరి రాముం బం పు మననా సుతునకన్న పానములుగుకురునో లేవో యని సందే హించినా డిప్పుడు రాముఁడు భార్యాసహితుఁడు గాన నే జేసిన వెలి తినంతయుం బూర్తి జేసుకొనునటు దశరథుం డేర్పాటులం జేయిం చును రాముడు తినలేకున్నను తాను తృప్తికీరం దిని పించునని యెకనక్కేముగ నన దశరథుడు మహాత్మా పుత్రవాత్సల్యమట్టిదని తమ రెరుంగరే క్షమింపుడని పయనములం జేసి తిరుగా నయోధ్య కువచ్చుచుండ “నతిసర్వత్ర వర్జయేత్” అను న్యాయంబున దశర థుని యమితసంతోషభంగంబు గావింపం బరశురాముం డగు నప శ్రమతోషం బరశురాముం డడ్డమువచ్చి యవమానముఁ బొందిన ను పండితుడు తనకన్న పండితు నేదర్శించి సంభాషింప నుత్సహిం చినట్లు రామునిం గలిసికొన శ్రీరాముం డిదివరకు పరశురాముం డిట్టివాఁడని యొకులవలన వినియుండుటం బట్టి యీతడు పరశురా ముడు కావచ్చునని గంభ్రడగోడ్డలిం బట్టిగ్రహించి సాష్టాంగ నమ స్కారమ్మాచరించి వినయభావంబున నిలువఁబడ నయ్యాముని కియ్యా కొని యరుదెంచిన వాఁడైనను తేజస్సుగల యీశ్రీరాముని గాంగి

లించుకొనక తప్పక నట్లుచేసి రామా సీతోఁ గొన్నిమాట లాడ వలసి వచ్చితి నన రాముం డప్పరశురాముని జూచి.

గీ వయసునందునఁ బాపడవక్తగాను
చెప్పుమాట నర్థం బైన జేయలేను
ఈయవచ్చితి రేదియో దివ్యతేజ
మమలసద్గుణి కౌశికునట్లు మీరు.

జంజూటి-మిశ్రగతి

ప. వినిపింపు డదియేదో । వినియెద నేను

అ. ననుదయగనుజూడ ॥ నగుమీ మొదలోను ॥వి॥

చ. కుశికపుత్రుండు గూడ।కోరె నిట్లు పకృతికై నన్ను
పశుపతి పగిదితుదకు బన్నె నీతెన్ను ॥వి॥

2. తమరేకారణమునఁ । దయ చేసినారో
శ్రమమైన నేపని । సలుపుమన్నారో ॥వి॥

గీ. ఇట్లు వినయముగాఁ బల్కు నినకులినికి
మారు బలుకఁగ నోరాడ నేఱదయ్యె
వందనం బిడెదను మీకు పరమపురుష
యంచు నిర్లోపి పలుకఁగ వచనమొట్టు.

వ. అదియును గాక.

గీ. ఆకసము మీదికే బైన నఱుగఁ గలదె
సాగరంబున బెండులు సాగకున్నె
చంద్రకాంతిని చీకటి పొందఁగలదె
రామువద్దకుఁ గోపము రాఁగలుగునె.

వ. తుదకాపరశురాముడు సీతారాముని జూచినకొంది.. హృదయము వెన్నవలె నగుచున్నను కార్యకాముని కిని చూపనియని వ్యాఖ్యహారిక

మునకును కఠిణక్మను చాలదూరమున్నదని యోచించి యెట్టకేలకు లేని కోపముం దెచ్చుకొని యోరీ రామా!

గీ. తండ్రిచెప్పి యుండఁగఁ బోలు మద్రహాస్య
మందుచేతనె నామది నలరఁ జేసు
కొనుచు నుంటివి నేనెఱుంగుదును సుమ్ము
తాతకా మప్పుటలు పొడిదగ్గు లహహా!

కం. అనినంత దాశరథి మది
కనికరవినయములు మాని క్రౌర్యముఁ బూనక్
ఇనకులజు డిట్లు హేళన
మొనరుప యోచించువానిఁ బూజించితి నే.

వ. అనుకొని ఐననుఁ గారణములేని కలహముందునే యీమాట లెట్లుగా మారునో చూతమని వీరరసం బొప్పారఁ జూచుచుండఁ బరశు రాముడు.

1. శ్రీరామా యీవిల్లు నెక్కిడుము । శివునివిల్లుగాఁ గనక
సారరహితమగు విల్లునువిడిచిన ॥ జగచ్చౌర్యఖనితునక.

2. విల్లును నెక్కిడఁ గల్గినట్లైన । వెళ్లె దయోధ్యాపురికిఁ
జల్లగ నటు జరుపకున్న నిటనుండి । సాగెదవిఁక యమపురికి.

3. తెగఁగొట్టితి నిరువదియొక్కమారు ॥ పగచే రాజులతలలు
అగుమనకును యిట్టులని గాజులుదొ । డుగుకొనె సీతండ్రిహడలు.

వ. హడలుగానుండునని చెప్పఁ గోపోద్దీపిత మానసుండై.

గీ. బాపడవు నీకిటులట్టి పలుకు లేల
సంధ్యగా దిది పెదవులు చప్పళింప
జందెములు గావు వడుకఁగ సంగరమన
మాటలతిగనాడితి వేని మద మణంతు.

వ. అని యాపరశురాముని చేతి విల్లుంగైకొని నారి సారించి బాణము
న్సంధించి విల్లునెక్కిడి యాకోదండంబుతోడనే పరశురామునిలో
నుండు దివ్యతేజమును తనతోలిపలుకు సార్థకపరచుకొన నాకర్షింప
నప్పరశురాముడు సాష్టాంగ నమస్కారముం జేయ మహాత్మానను
గు పెద్దలిట్లుసేయుట ధర్మమే యని యెక్కిడిన వింటికోల నాకసము
నకు వదలి పడియున్న పరశురాముని లేవదీసి బిగ్గఁగౌగిలించుకొన
మహాత్మా బాల్యచాపల్యమున ననిన మాటల లెక్కింపకు డను
రామునితోఁ దన పూర్వవృత్తాంత మంతయుంజెప్పి సెలవుతీసికొని
స్వస్థానంబునకుం బోవుచు నావిల్లు నీవే యుపయోగించుకొను
మని యేగె నంత దశరథునితోఁ దాశరథులు సభార్యులై య
యోధ్య కఱిగి సర్వసుఖంబుల ననుభవించుచుండిరి.

గద్యము.

ఇది శ్రీబాలకళానిధి కౌమ్మారి
బాల బ్రహ్మానందకృత
శ్రీరామకథాలహరి
బాలకాండము
సంపూర్ణము.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B173 |
| పుస్తకం పేరు | రామకథాలహరి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 75 ,CI |
| లేని పేజీలు | i to iv |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |